# తిక్కన రస భారతి

రచన

డా॥ ఎల్లూరి శివారెడ్డి

ప్రచురణ

రిజిష్టర్డు నెం. 1/64

యువభారతి

5 కింగ్స్ వే,

సికింద్రాబాద్ - 500 003.

**TIKKANA RASA BHARATHI**
Poetic Selections of Tikkana with Literary Commentary By
Dr. Elluri Siva Reddy.



ప్రచురణ : 106

ప్రథమ ముద్రణ :
అక్టోబర్ 5, 1984

ప్రతులు : 3,200

ముఖ చిత్రము : శీలా వీర్రాజు

ముద్రణ :
ఎ. ఎస్. ఆర్ట్ ప్రింటర్స్,
తిలక్‌నగర్, న్యూనల్లకుంట,
హైదరాబాద్ - 44.

ముఖచిత్ర ముద్రణ :
బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్,
చిక్కడపల్లి, హైదరాబాద్.

ప్రతులకు :

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు - 3

యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్ రోడ్, హైదరాబాదు-500 001

వెల : రూ. 4/-

# యువభారతి పరిచయం

ఉత్తమ అధ్యయనం వల్ల వ్యక్తిత్వానికి సమగ్రత చేకూరుతుంది. సమాజంలో సామరస్యం పెంపొందుతుంది, ఉత్తమ భావ ప్రసంగానికి పుస్తకాలు చక్కని సాధనాలు అందరికీ అందుబాటులో ఉండే విధంగా మంచి పుస్తకాలను అందించే ప్రయత్నానికి యువభారతి పూనుకొని గడచిన ఇరువయ్యేళ్ళుగా పాత కొత్తల మేలు కలయికను ప్రాతిపదికంగా పెట్టుకొని నూరు పుస్తకాలను ప్రచురించినది. ఉపన్యాస కార్యక్రమాలను మంజరీసదస్సులను, నిర్వహించింది.

సహృదయుల సహకారంతో పుస్తకాల అమ్మకం వల్ల వస్తున్న ద్రవ్యంతో పుస్తకాలను ప్రచురిస్తూ తక్కువ వెలకు ఎక్కువ విలువ వున్న సాహిత్యాన్ని అందించడానికి యువభారతి పుద్యమిస్తున్నది. ఉత్తమ సాహిత్య ప్రచారాన్ని ధ్యేయంగా పెట్టుకొని ప్రచురణలను వెలువరిస్తున్నదే కాని మా సంస్థ వ్యాపార సంస్థకాదు.

భారతదేశంలో ఎక్కడున్నా సరే యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలు పంచుకునేందుకు ప్రారంభింపబడిన సాహితీ మిత్ర పథకంలో 8500 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేసినారు. యువభారతీ భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన సభ్యత్వ పథకాలలో భారతీ మిత్రులుగా 1100 మంది భారతీభూషణులు 125 మంది చేరారు.

హైదరాబాదు. ఇరివెంటి కృష్ణమూర్తి

అక్టోబరు, 5, 1984 అధ్యక్షులు, యువభారతి

# మా మాట

కవిత్రయం అంటే నన్నయ్య, తిక్కన, ఎఱ్ఱయ్య అనే ముగ్గురుకవులు. వీరితో పరిచయం లేనివాడు తెలుగుసాహిత్యలోకంలోకి ప్రవేశించడానికి దారి వెదుకుతూ కాడంబడి పోతాడు. వేదాలలోని సారమంతా భారతంలో ఉన్నది. అన్ని పురాణాల్లోని కథల జాడలు భారతంలో కనిపిస్తాయి. భారతంలోని భారత దేశంలోనే కాదు ప్రపంచంలోనేలేదు. అలాంటి మహేతిహాసాన్ని మనకు కావ్యంగా మలచి ఇచ్చి మనభాషకు ఒరవడినీ మనకవితకు ఆదర్శాన్నీ మన సంస్కృతికి ప్రమాణాలనూ అందించిన మనీషులు కవిత్రయంవారు మన తెలుగు వ్యాకరణ నిర్మాణానికి పునాది తెలుగు మహాభారతం. నన్నయ రెండున్నర పర్వాలనూ తిక్కన పదిహేను పర్వాలనూ, ఎఱ్ఱయ్య, నన్నయ విడిచిన భాగాన్ని రచించినారు సంస్కృతంలో వ్యాసుడు చెప్పినట్లుకాక, ఆయన హృదయాన్నిమనకు చూపించినాడు పద్యాల్లో గద్యాల్లో.

ఎక్కువభాగాన్ని అంటే పదిహేనుపర్వాలను తిక్కన తెలుగు చేసినాడు. తెలుగుపదాలకూ తెలుగు చందస్సులకూ తిక్కన భారతం ఆలవాలం గహనమైన వేదాంత విషయాలనుకూడా తేటతెలుగులో చెప్పడానికి ఆయన చేసిన ప్రయత్నం తెలుగుభాషకు ఎంతో విలువను సంపాదించిపెట్టింది. ఆయన లేఖినీ ప్రభావంవల్ల రసపోషణలో తిక్కనను మించిన కవి నేటికీ తెలుగులో అరుదే శివకేశభేదమును ప్రచారంచేసి 'భేదము లేనిభక్తి' ని బోధించి సమన్వయ ధోరణినికి దైనందిన ధార్మిక జీవితంలో అలవడ జేసిన యుగ పురుషుడాయన.

తిక్కన భారతంలోని కొన్ని పద్యాలను ఏరుకుని వాటిలో ఆయన పోషించిన రసస్వరూపాన్ని సాక్షాత్కరింపజేసినారు ఈ పుస్తకంలో డా ఎల్లూరు శివారెడ్డిగారు. శ్రీ రెడ్డిగారు మంచికవులు ఉత్తమాధ్యాపకులు స్నేహపాత్రులు సురవరం ప్రతాపరెడ్డిగారిజీవితంపై చక్కని పరిశోధనగ్రంథంవ్రాసి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి బహుమతి నందుకున్నవారు తిక్కన విరాటోద్యోగపర్వాల్లోని రసపోషణను గూర్చి పరిశోధన చేసి ఉస్మానియా విశ్వవిద్యాలయం నుంచి పి. హెచ్. డి పట్టాను సంపాదించినారు.

'యువభారతి' నిర్వహిస్తున్న సాహిత్యోద్యమానికి చేయూతనిస్తున్న సహృదయులు. పోస్టుగ్రాడ్యుయేట్‌కాలేజ్ (ఉస్మానియా విశ్వవిద్యాలయం) లో తెలుగు శాఖలో రీడరు. డా. ఎల్లూరుశివారెడ్డిగారు ఈ గ్రంథాన్ని ఎంతో ఓపికతో, ఎంతో చక్కని శైలిలో, ఎంతో రసాత్మకంగా వ్రాసి మాకు ప్రచురించుకునే అవకాశాన్ని కల్పించి తమ ఔదార్యాన్నీ సాహిత్యప్రణయాన్నీ ప్రసాదించినారు ఆయనకు యువభారతి పక్షాన కృతజ్ఞతాభివందనాలను సమర్పించుకుంటున్నాను.

ఇరివెంటి కృష్ణమూర్తి

5. 10. 84. అధ్యక్షుడు.

# భావబ్రహ్మ

ఈ సృష్టి అస్పష్ట భావలీలకు రూపకల్పన. భావమే బ్రహ్మాండానికి బీజం. ప్రపంచం భావభాస్వంతం. అలాగే కవిసృష్టికి భావసంపద మూలద్రవ్యం. మరి ఉదాత్తరచన భావభవ్యం. కవి తన మేధాసంపత్తికి అనుగుణమైన ఇతివృత్తాన్ని స్వీకరించి దానిని భావమధురంగా రమణీయమూర్తిగా మలచుకొంటాడు. ఏ నాడైనా, ఎవరైనా మహారచనను భావానుభూతికోసమే చేపడతారు. ఆ అనుభూతికే రసానందం అని వాడుక.

తెలుగు సాహిత్యంలో ముగ్గురుమూర్తుల మనోజ్ఞకథనం మహాభారతం. ఆదికవి మధురాలాపనాన్ని గౌరవిస్తే కవిబ్రహ్మ రసమయవాక్కును అభిమానించి రవళింపజేశాడు. ప్రబంధపరమేశ్వరుడు వారిరువుర భంగిభణితిని మేలుబంతిగా చేసుకొన్నాడు. మానవప్రకృతిని మూలముట్టుగా అవగాహన చేసుకోనిదే ఎంతటి కవికైనా రససృష్టి అలవడదు. ఆ దృష్టి పుష్కలంగా పల్లవించిన పురుషోత్తముడు తిక్కనకవి.

తిక్కనసోమయాజి పాత్రల అంతఃకరణాల ఆంతర్యాన్ని అద్భుతంగా చదువగలిగిన రసవేత్త. మహాభారతంలోని పాత్రలు అనేకం. ఒక పాత్రను పోలి మరోపాత్ర ఉండదు. మొదట వానిని అలా తీర్చిన గౌరవం ఆ వ్యాసభగవానునికి దక్కుతుంది. ఆ దృష్టిని తన రససృష్టిలో మొక్కవోనీయక రంజింపజేయగలిగిన మహనీయత తిక్కయజ్వకు చెందుతుంది.

కవిగా తిక్కయజ్వకు కొన్ని అభిరుచులు, అభిప్రాయాలు ఉన్నవి. ఆ అభిప్రాయాలు నిర్వచనోత్తర రామాయణ రచనా సందర్భంలో ఆయన మనస్సులో పాదుకొన్నవి. కాని అవి పరిపూర్ణంగా మహాభారతరచన సందర్భంలో గాని పరిపాకానికి రాలేదు. అట్లని భావించటం ఆయన నిర్వచనోత్తర రామాయణరచనలో రసనిర్భరత్వాన్ని శంకించటంకాదు. భారతరచనా రామణీయకతను అభినుతించటమే అవుతుంది.

నిర్వచనోత్తర రామాయణ పీఠిక తిక్కనకవి కవిత్వాశయాల రత్నపేటిక. రచన వివేకచిత్తుల మనసులకు ఎక్కినగాని ఆయనకు నచ్చదు. 'ఆపరితోషా ద్విదుషాం

నసాధుమన్యే ప్రయోగవిజ్ఞానం' అన్న కాళిదాసు అభిమతం ఆయనకు సమ్మతం, మాటలు పూరేకుల లాగా, అంతరార్థం గుమగుమలాడే తావిలాగా ఉండాలని తలచిన వాడాయన. పూలేర్చి మాలలు తీర్చినట్లు మాటలతో మధురవాక్యయోజనం చేయటం ఆయనకిష్టం. శ్రుతి దుష్టమైన శబ్దాన్ని పరిహరిస్తాడు; శక్తిమంతమైన శబ్దాన్ని వరిస్తాడు. ఆయనదొక ఉత్కృష్టశైలి (Elevated style). 'మితం చ సారంచ వచో హి వాగ్మితా' అన్న నైషధకర్త మాట మీద ఆయనకు గురి తాను విరచించ టానికి సిద్ధపడ్డ భారతంలోని రసాభ్యుదయానికి, దాని వర్ణనకు ప్రాతపడ్డ మాటలు చాలవని భావించాడు. ఆయన వ్యవహారధురంధరుడు కావడంచేత లోకంలో ఏ శబ్దం చెవిలో పడినా పదిలంగా దాచుకొని అవసరమైనప్పుడు దాన్ని అందంగా వినియోగించుకోగలిగిన క్రియాశీలి మాటలమధ్య మమకారాన్ని పెంచిన కవి తిక్కన సోమయాజి. ఆనాటి శైవమతానుయాయులైన కవులు ఛందస్సులో, భాషలో, పాత్రపోషణలో అతి వాదమవలంబించారు. కాని ఆయన హితవాది. ప్రతిభావంతునికి నియమం అడ్డంకి కాదన్నది ఆయన దృక్పథం. యతిప్రాసలను పులిమిపుచ్చడం, సంస్కృత పదాలను యథేచ్ఛగా ప్రయోగించటం ఆయనకు నచ్చవు. అర్థానికి తగిన మాటలు ప్రయోగించాలన్నది ఆయన పరాయణత. సత్కవీంద్ర మార్గమేదో ఆయనకు తెలుసు, అధ్యయన మననాదులవల్ల ఆయన చిత్తం సంస్కృతమై, సంస్కారము అనుభవ సంపన్నమైన మహాకవి వ్యవహారధురీణుడు కావాలి. అలా కాకపోతే జీవనస్రవంతిలోని స్పందనా మాధుర్యానికి వెలియైపోతాడు. క్రీ. శ. 1210 నుంచి 1290 వరకు విస్తరించిన ఆయన జీవితంలో మానవ జీవితమందలి ఎగుడుదిగుళ్ళను సునిశితంగా పరిశీలించే అవకాశం కలిగింది. అందుకే ఆయనది అనుభవసంపన్నమైన అపలోదాత్తమనీష. ఈ మనీషిలో వ్యుత్పత్తి, ప్రతిభ ప్రతిభటత్వాన్ని వహించాయి అహమహమికతో తారసిల్లాయి.

ధీరోదాత్తనృపోత్తముడైన రామచంద్రుని చరిత్రను ఈ కవిచంద్రుడు తనతొలిరచనకు ఇతివృత్తంగా స్వీకరించి, దానిని నిర్వచనంగా వ్యాకరించి సార కవితాభిరాముడైనాడు. ప్రాచేతసుని రమణీయరచన తిక్కనకవి చేతస్సులో ప్రతిఫలించి నిర్వచనోత్తర రామాయణ కృతిగా రసమంజులమైంది. జాత్యమైన ఆయన సంస్కృత పదావళి ఆంధ్రకవితా సరస్వతికి హారావళిగా, తారావళిగా తర ళించింది. 'లలితపద హృద్యపద్యములతో తిక్కనకవి తొలిరచన మలిరచనలు చిరంజీవులై నిలిచాయి

తిక్కన నాటకీయతను గురించి కొంత సమాలోచించాలి. జగత్తు ఒకలీల. మానవజీవితం ఒకనాటకం. ప్రతిజీవి ఒకపాత్ర. లోకతత్త్వం తెలిసినకవులు మానవజీవితాన్ని జగన్నాటకంగా దర్శిస్తారు. ప్రకృతిలో నాటకకృతిలో రెండింటా గుణారోపం సమానమే ! అందుకే నాట్యశాస్త్రంలో భరతముని, లోకవృత్తాను కరణం నాట్యం, అని అన్నాడు. ప్రపంచం విభిన్నచిత్తవృత్తుల కూడలి అలాగే నాటకం కూడా ! దురవగాహంగా ఉన్న జగన్నిర్మాణతత్త్వాన్ని ఆకళించుకోగలిగితే కవికి కావ్య నిర్మాణం సుకరమవుతుంది. తిక్కనకవి అలాంటి జగత్త్వవేత్త.

తిక్కనకు (భరతుని) నాట్యశాస్త్ర పరిజ్ఞానం సూక్ష్మంగా ఉందని ఊహించడానికి అవకాశం ఉంది. విరాటుని సభలోనికి వచ్చిన బృహన్నల తనకున్న నాట్యశాస్త్ర పరిజ్ఞానాన్ని గాయామి నృత్యామ్యథ వాదయామి, భద్రోఽస్మి నృత్యేకుశలోఽస్మి గీతే అనిచాటుకున్నాడని మూలభారతంలో ఉంది (భండార్కరుప్రతి) కాని ఈ విషయాన్నే తిక్కన కవి ఇలా విస్తరించారు.

"మిశ్రితవాద్యంబులు మం
జుశ్రుతి సంభావ్యగీతసుగతులు సద్భా
వాశ్రయములఁ దజ్జన్యర
సాశ్రయములైన యభినయంబు లెఱుఁగుదున్'

బృహన్నలకు అభినయవిద్య తెలుసునట ! ఆయన వాద్యాలు గీతగతులు ఎరుగునట ! భావాలు, తజ్జన్యరసతత్వం నేర్పాడట ! ఇవన్నీ బృహన్నల నేర్చినా నేర్వకున్నా తిక్కన కావ్యశాస్త్ర పరిజ్ఞానాన్ని పట్టిచూపడానికి ప్రబలనిదర్శనాలు ! శ్రమము చేయించుఁజతురతా విహీనములైన పాత్రములనైన.... నిపుణనై పథ్యవిధులకు నేరుతు. (విరాట 1-242) అని బృహన్నలనోట తిక్కన పలికించాడు పాత్రలచేత శ్రమచేయించటం అనగా అభినయసూచనలను వర్ణించి శ్రవ్యకావ్యాన్ని దృశ్యకావ్యంగా పరిణమింపజేయటం!

నాటకీయతకు సహాయపడే మరోలక్షణం సంభాషణల రచన.

భారతరచనలోని సంభాషణలు అలతి అలతిగా ఉంటాయి. సాధారణంగా పాత్రంచేత దీర్ఘోపన్యాసం చేయించే అలవాటు సోమయాజికి లేదు. శ్రీకృష్ణుడు రాయబారానికి వెళ్ళినపుడు చేసిన ఉపన్యాసమే కొంత దీర్ఘంగా ఉంటుంది. అలాంటి సందర్భాలు రెండు మూడు తప్ప ఎక్కువగా లేవు. సంభాషణలు చిన్నవిగా ఉంటే భావాలు చిక్కగా ఉంటుంది. మాటలకొక శోభకలుగుతుంది, అదీగాక ఉద్యోగపర్వంలో

భావచిత్రణకేగాని కథాంశముల ఒరపడికి ప్రసక్తి లేదు. చిత్తవృత్తుల చిత్రీకరణమే రసపోషణకు రమ్యపథం అని భావబ్రహ్మ అభిమతం. దీని ననుగుణంగానే భారతాన్ని తీర్చిదిద్దాడు.

ఎంత సమర్థుడైన కవిఅయినా నాటకీయతకు పనికిరాని వస్తువును తీసుకొని దానిని దృశ్యకావ్య లక్షణ సంభరితంగా తీర్చుటకు పూనుకోడు. అయితే రచనలో అటువంటి అవకాశం ఉంటే తన ప్రతిభచేత దానికి మెరుగుదిద్దుతాడు. మహాభారతంలోని వస్తువు నాటకీకరణకు ఎంతో అనుకూలమైంది, అందులో విరాటోద్యోగ పర్వాలు ఇందుకు అనువైన కథాంశాలు కలిగినవి. తిరుపతి వేంకట కవులు ఉద్యోగపర్వ-ఇతివృత్తాన్ని స్వీకరించి దానిని పాండవోద్యోగంగా తర్వాతి కథను పాండవవిజయంగా నాటకీకరించటం ఇందుకు నిదర్శనం, విశ్వనాథ విరాట పర్వేతి వృత్తాన్ని వస్తువుగా తీసుకొని 'నర్తనశాల' గా నాటకీకరించారు. వీరికి స్ఫూర్తినిచ్చింది కవిత్రయ భారతమే కాని వ్యాస భారతం కాదు. నిదానంగా గమనిస్తే తిరుపతివేంకటకవుల నాటకంలోని కొన్ని పద్యాలకు ఛాయలు భారతంలో ఉన్నవి.

కవిత్రయం వారిది అనువాదమూ కాదా? అందులో వారి ప్రతిభ ఏముంది? అనేవారున్నారు. ఈ ప్రశ్నకు తృప్తికరమైన సమాధానం చెప్పవలసి ఉంది. సాహిత్యప్రపంచంలో మూలగ్రంథం కంటె అనువాదం శ్రేష్ఠంగా ఉంటుందని చెప్పడానికి ఉదాహరణంగా ఎన్ని రచనలను చూపగలం ? తెలుగులో ఆ గౌరవానికి నోచుకొన్న రచనలు కవిత్రయ భారతం, పోతన భాగవతం కావ్య కళా దృష్టితో గమనిస్తే వ్యాసభారతం కంటె కవిత్రయభారతం మేలురం అనిపిస్తుంది. ఇలా అనడం వ్యాసవరమేష్ఠి మహాత్మ్యకు న్యూనతను ఆపాదించడం కాదు. వ్యాసుని దృష్టి కథను ధర్మాభిముఖంగా నడిపించడం ఆ ప్రయత్నంలో ఆయన అద్భుతమైన సిద్ధిపొందాడు. అది ఇంకొకరు ఆశింపదగింది కాదు--ఆశించినా అందేది కాదు. ఆ సంస్కృతభారతాన్ని తెలుగు లోనికి అనువదించే కాలంనాటికి అభివృద్ధి చెందినా కావ్యశాస్త్ర వాఙ్మయాన్ని పరిశీలించి తల్లక్షణోపేతంగా అనువాదాన్ని వినిర్మించారు తిక్కన సోమయాజి కావ్యశాదృకృపథాన్ని అవలంబించి కవిత్రయం వారు-అందులోను తిక్కనకవి-భారతాను వాదాన్ని తీర్చిదిద్దారు.

తిక్కనకవి 'కేవల భావానందమయా' అని హరిహరనాథుని స్తుతించాడు అదే విశేషాన్ని మనం తిక్కనకవి పరంగా వాడి ఆయన స్వభావాన్ని సూచింప వచ్చు. ఇహలోకంలోని భావసుఖాన్ని పరిపూర్ణంగా రుచి చూచిన వాడాయన.

తిక్కనకవి వస్తు, అలంకార. భావకళల్లో భావకళకే ప్రాధాన్యం కల్పించి తక్కిన రెంటిని వాటికి అంగాలుగాచేశారు. వస్తువును భావానికి అంగంగాచేయడం ఎలా కుదురుతుందని అనవచ్చు. వస్తువు ఎదుట ఉన్నప్పుడు చిత్తం ఎన్ని వికారాలను పొందుతు దో ఆ వికారాలను వర్ణించటమే భావకళ. తిక్కన క్షుణ్ణంగా తెలసినవాడు. పాత్రల మనో భావాలను వాటి రంగులను బయటపెట్టి పఠితకు అవ్యయమైన భావపాథేయాన్ని సమకూర్చారు. భారతం అంతగా జనహృదయాలను ఆకర్షించటానికి కారణం దానిలో వర్ణితమైన భావావేశాలు సర్వజనసాధారణం గాపడమే ఈ నాటికి వయసు పండినా జీవశక్తి వెలయించే ప్రతివృద్ధుడు వీరమూర్తియైన భీష్ముడే! అన్నదమ్ములకు ఆదర్శప్రాయుడై త్యాగధనులైన ప్రతి అగ్రసోదరుడు ధర్మరాజే! సతుల మాన రక్షణకు అతుల బలప్రదర్శకుడైన ప్రతి ప్రచండమూర్తి భీముడే! లోకంలోని భారతపాత్రలు నిజంగా చనిపోలేదు. వారు చిరంజీవులు.

భారతాన్ని పఠించి సహృదయుడు పొందేది ఏమిటి ? అన్న ప్రశ్నకు సమాధానం కావాలి. మానవుని ఆవేశాలు. ఉద్వేగాలు పరిశుద్ధం కావలని ఉంది. ఇది పరిశుద్ధం కావాలంటే వాటికి విజ్ఞానతత్త్వపరిష్కారం కావాలి. సంయమన భావం అలవడాలి. మహాభారతేతివృత్తపఠన సలిలస్నానం చేసిన వాని కాయిక వ్యాపారం, మానసికవ్యాపారం పరిపూతం అవుతాయి. భారత-అధ్యయనంవల్ల సహృదయుల స్వభావంలో ఉదాత్తత కలిగితీరుతుంది. ఏ గొప్ప రచన అయినా పఠితదృక్పథాన్ని నిశ్చయంగా మార్చివేస్తుంది.

కవిబ్రహ్మ కమనీయ కవితను ఎందరో అనుభవించి, ఆనందించి, ఆ ఆనందాన్ని విమర్శల ద్వారా వ్యాఖ్యానాల ద్వారా లోకానికి అందించారు. తిక్కనగారి భారతంలో కొన్ని పద్యాలకు సరళవ్యాఖ్య వ్రాయవలసిందని యువ భారతివారు నన్ను కోరారు. ఆవిధంగా నాకు చేతనైన రీతిలో వ్యాఖ్యవ్రాశాను. ఈ విధంగా తిక్కన రసభారతికి హారతిపట్టడానికి అవకాశం కల్పించిన యువభారతి వారికి నా అభినుతి

డా॥ ఎల్లూరి శివారెడ్డి.

# తిక్కన రసభారతి

విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేశుండు విజ్ఞానసం
పద్విఖ్యాతుఁడు సంయమిప్రవకర సంభావ్యానుభావుండు గృ
ష్ణద్వైపానుఁ డర్థి లోకహితనిష్ఠంబూని కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నాయమునన్

(విరాట - 1 - 8)

ఇది తిక్కన మహాకవి వ్యాసమహర్షిని భావించినతీరు. భారతీయ సంస్కృతికి విజ్ఞాన సర్వస్వం భావించుకొన్న మహాభారతాన్ని రచించిన మహాముని స్తుతి సముచితం. సంభావ్యం. వ్యాసర్షిలోని ఏయే గుణాలు తిక్కనను ఆకర్షించాయో అయా గుణసూచకాలే పై పద్యంలోని ఒక్కొక్క విశేషణం. వ్యాసభట్టారకులది విద్వాంసులచే పొగడబడిదిన శుభప్రదమైన కవితావేశం. ఎంతటి కవితావేశం ఉంటే అంతటి విస్తారవాఙ్మయరచన సాధ్యవుతుంది. మరి ఆయన విజ్ఞానసంపద చేత సుప్రసిద్ధుడు. విజ్ఞాననిధి అయిన వానికి ధననిధితో ఏం పని! ఆయన మహనీయత ఋషులకు మాత్రమే అర్థమగునుట! వేదవిజ్ఞానాన్ని విశ్లేషించి, ధర్మప్రవృత్తిని పురాణాలలో ప్రపంచించి, వేదాంత సూత్రాలను విదితం చేసిన సంయమికి ఒకే ఒక ఆశయం ఉంటుంది. అది లోకహితనిష్ఠ. అన్నాడు. భారతం విభిన్నధర్మాలకు సమన్వయం సాధించింది. దానినే తిక్కన ధర్మాద్వైతస్థితి అన్నాడు. ధర్మాలకు ఐక్యము ఘటించడం, ఆమ్నాయమనిపించుకోదగిన భాతతం ఆ భావైక్యతను సాధించలేకపోతే యేముంది? ఆమ్నాయ మనగా పరంపరగా గ్రహింపబడింది. అంత పవిత్రమైంది వేదం తప్ప హిందువులకు మరొకటి ఏముంటుంది ? 'యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్క్వచిత్' అని సంస్తుతికెక్కిన భారతరచన కావించిన కృష్ణద్వైపాయనుడు విజ్ఞాన సంపద్విఖ్యాతుడే!

తన రచనకు మూలద్రవ్యం సమకూర్చిన వ్యాసర్షిని స్తుతించి తదేకదీక్షతో భారతరచనకు పూనకొన్న తిక్కన కవిని వ్యాసుడు ఆవేశించాడా అనిపిస్తుంది. వ్యాసముని భారతాన్ని జీర్ణంచేసుకుని, కావ్యకళాదృష్టితో తెలుగులో వినిర్మించిన తిక్కన మహాకవి అపరవ్యాసుడే!

నెగడి నకొనలెత్తి నింగి యంతంతకు
నవులఁ ద్రోపఁగఁ దనరారుదానిఁ
జాఁగిన శాఖ లాశాచక్రమున కొలం
దులు వార వెట్టంగఁ బొలుచుదానిఁ
గవలొండొంటితోఁ గదియుచు నెడములఁ
ద్రింగి ప్రబ్బఁగ సొంపు మిగులుదాని
లోనిజాంపము వెలుఁగు బెడఁ జీకటి
నొదవించి పొదలంగ నొప్పుదానిఁ
గనియెఁ బవమాన విచలిత నర్తనక శాఖ
వర్తిఁ గాక ఘూకారావస్ఫూర్తి జాత
భీతిపరిసరవర్తి నాభీలభుజగ
చండమూర్తి శమీతరు చక్రవర్తి. (విరాట - -162)

దుర్మార్గవర్తనులైన మానవులు, వ్యాఘ్రాదులైన జంతువులు మాత్రమేకాదు అవస్థావశాన వృక్షాలుసైతం భయంకరంగా ఉండవచ్చును. అటువంటి శమీ వృక్షాన్ని తిక్కనకవిపై సమలంకృత పద్యంలో వర్ణించాడు. పాండవులు అజ్ఞాత వాసం నిర్వర్తించినప్పుడు తమ ఆయుధాలను నిక్షిప్తంచేసిన శమీవృక్షమే అది. ఆ వృక్షం భయప్రదం కాకపోతే పశుపాలుర వంటివారెవరైన ఆ ఆయుధాలజోలికి పోతారేమోనని పాండవులు ఏరికోరి దాన్ని ఎన్నుకొన్నారు. పై పద్యంలో వర్ణిత మైంది దాని స్వరూపం.

ఇందులో కొమ్మలకొనలు నింగిని పైకి నెట్టుతూ ఉన్నవని చెప్పటం అతిశయోక్తి. దిక్కులకు సాగిన దాని దీర్ఘమైన కొమ్మలు దిశామాపనంచేస్తున్న వనడం ఉత్ప్రేక్ష. పెద్దకొమ్మలు తమ నిడుమి ఎడమును మింగివేసి ఒక దానితో మరొకటి పెనవేసికోవడంలో అతిశయించిన దాని స్థౌల్యం తెలుస్తుంది. శ్యామా యితంగా ఉన్న దట్టమైన ఆకుజొంపాలు పగలే చీకటిని సృష్టిస్తున్నాయనడం కూడా అతిశయోక్తి. అందువల్ల దానిపై దాచుకొన్న ఆయుధాలు పరులకంటపడవు అన్న విషయం ధ్వనిస్తుంది. గాలి పల్లవల్లించే ఆ వృక్షం నర్తిస్తున్నట్లున్నది. కాకి గుడ్లగూబలచప్పుళ్ళచేత, భుజంగాలచేత భీతిదమై అనధిగమ్యం అయింది. పై పద్యంలోస్ఫురించే అతిశయోక్తులు, ఉత్ప్రేక్షలు చతుర్దిశలా వ్యాపించి చూచే

హరితో భయంకరంగా ఉన్న ఆ శమీవృక్షస్థితిని సమగ్రంగా స్ఫురింపజేస్తున్నాయి. సీస పద్యంలోని పాదాలు వేసికవే విశ్రాంతి పొంది లోలమానమైన కొమ్మలనర్తనాని, ఆ నర్తనంచేత వర్తిల్లిన దాని ప్రచండరూపాన్ని భాసింపజేస్తున్నాయి. పద్యంలో అంత్యానుప్రాసవల్ల ఆ శమీతరువు చలనావస్థలో కలిగించే ఆరావం స్ఫురిస్తున్నది. దృశ్యవర్ణనలో తిక్కనగారి భావనాశక్తి ఎలా పని చేస్తుందో దర్శించ దానికి అనువైనదీ పద్యం.

దుర్వారోద్యమ బాహు విక్రమ రసాస్తోక ప్రతాపస్ఫుర
ద్గర్వాంధ ప్రతివీర నిర్మథన విద్యాపారగుల్ మత్పతుల్
గిర్వాణాకృతు లేవు రిప్డు నిను దోర్లీలన్ వెసంగిట్టి గం
ధర్వుల్ మానముఁబ్రాణముంగొనుట తథ్యం బెమ్మెయిన్ కీచకా

(విరాట - 2-55)

రౌద్రం పురుష ప్రకృతికి అలంకారమైనట్లు స్త్రీజాతికి కాదు. గృహస్థ ధర్మాన్ని నిర్వర్తింపవలసిన పురుషునికి ఆత్మరక్షణార్థం క్రోధప్రకటనం సహజమే ఆత్మరక్షణకై పూనుకొన్న ద్రౌపది తన వెంటబడ్డ కీచకుని జడిపించటానికి చేసిన ప్రయత్నమే పై పద్యంలోని విషయం. తన పతులు స్వయంగా కీచకుని ఎదిరించ డానికి అనువైన సమయం కాదు కనుక ఆధునిక స్త్రీలా ఆమే ఆ ఉద్యమానికి పూనుకొంది. పరకాంత అని తెలిసికూడా పరసతీ సంఘమున వచ్చు పాపమునకు నోరుతును గాని ఈ మదన వ్యథ సహింపలేను అంటున్నాడు. ఆ కామశాస్త్ర కోవి దుడు కీచకుడు. హితం, అహితం, మరచి రతంకోసం ఆరాట పడుతున్నవాని భయ పెట్టడానికి ప్రయత్నించిన తీరు ఇది. నాపతులు సురసన్నిభులు. భుజపరాక్రమ రసికతతో శత్రువీరుల నిర్మూలన విద్యలో పండితులు. వారిని ఎదిరించటానికి ఎవరికీ సాధ్యంకాదు. ఒకరుకాదు ఐదుగురున్నారు. నన్నవమానింప ప్రయత్నిస్తే ఇవుడే తటాలున భుజబలంతో నీ మానాన్ని ప్రాణాన్ని తప్పక హరిస్తారు కీచకా అని ద్రౌపది ఎంతో ఉద్రేకంతో అంటున్నది. శార్దూలవృత్తంలో గాఢబంధ యుతంగా సంయుక్తాక్షరప్రాసతో వెలసిన ఈపద్యంలోని ప్రతిలక్షణం రౌద్రాన్ని వ్యక్తం చేస్తున్నది.

తిక్కన 'విక్రమరసమని' అన్నాడు మహాభారతంలో తిక్కన రసపదాన్ని చాలామార్లు భావాలకు జోడించి ప్రయోగిస్తాడు. కవిబ్రహ్మ నవనాట్యరసాః

స్మృతాః అనుకోవకు చెందినే వాడు కాదు. అనంతా వై రసాః అనుద్భక ప్రథం గల వాడు. అనుభవదశలో ప్రతిభాసం రసస్థితిని పొందుతుంది అని ఆయన విశ్వాసం పై పద్యంలోని ఇష్టు అనురూపం ఇపుడు అనుదానికి గుర్తింపు దీనిలో ఉపకారము అనుప్రాణం అచ్చులోపించింది. అది కీచకునితో నీప్రాణము లోపించనన్నదని ద్రౌపది చెప్పిన మాట ధ్వనింప జేసినాడు కవిబ్రహ్మ 'ఇష్టు.... నీప్రాణముంగొనుట' అను వాక్యయోజనం చేసిచూస్తే ఆ అంతరార్థం భాసిస్తున్నది. పైగా 'కీచకా' అని ద్రౌపది అతన్ని సంబోధించింది కీచకమనగా లోనబొల్లగా ఉన్న వెదురు. వట్టి వెదురును చీల్చినట్లు నాపతులు నిన్ను చీల్చివేయగలరన్న ధ్వనితో కూడిన సాభిప్రాయ విశేషణం ది.

తన మొప్పెదుర(గన్న(దగిలి యెవ్వరికైన
మఱ(గి క్రమ్మఱ(జూడ వలయువా(డు
తన పర్తనము విన్న మునిజనంబునకైన
నలవరించి కొనంగ వలయువా(డు
తన వితరణకేళి వినిన(గల్పక తరు
పులకైన(దలయూ(ప వలయువా(డు

నకులు(డొరులకు నశ్వశిక్షకు(డు కా(గ
నగునె యాతని దుస్థితి యనుదినంబు(
గాంచి కన్నీరు డించుచు( గడపరాని
దైవఘటనకు నొత్తు(జిత్తంబులోన (విరాట - 2 - 208)

సాహిత్యంలో స్త్రీసౌందర్యాన్ని వర్ణించే పద్యాలే ఎక్కువగా ఉంటాయి, పురుష సౌందర్య వర్ణనచేసిన రచనలు లేక పోలేదుకాని - చాలా విరళం. అయితే సౌందర్యం సద్గుణశోభితమైనప్పుడే హృదయావర్జకంగా ఉంటుంది. భారతంలో కౌంతేయులకేకాని మాద్రేయులకు ప్రాధాన్యం లేదు. కీచకుడు తనను పరాభవించడంతో నాటి రాత్రి భీమసేనుని వద్దకు వెళ్లి 'నన్ను ఆ విధంగా కీచకుడు పరాభవంచేస్తే నీకు నిద్ర పట్టిందా' అని ద్రౌపది నిందవేసి అడుగుతుంది. పతుల అశక్తతను గర్హిస్తుంది. వివేకశీల గనుక వెంటనే చిత్తప్రసన్నతతో భర్తల మహనీయతను మదికి తెచ్చుకొని ఒక్కొక్కరి గుణసంపదను స్తుతిస్తూ నకులుని గురించి చెప్పినదే పై పద్యంలోని విషయం.

ఎదుటపడిన ఎవరైనా ఎవరీ ఆ దగాడని మరలి చూచేటంత సోయగం నకులునిది. ప్రత్యక్షంగా అంగాంగచిత్రణచే గాకుండా ప్రతిచర్యవల్ల వస్తుగౌరవాన్ని సూచించటం రసపోషణలో ఒక మెలకువ. నకులుడు మనుజులకు సైతం ఆదర్శప్రాయమైన శీలంగలవాడు. యుద్ధంలో శత్రువులచేత పొగడ్తలందటానికి అర్హమైన పౌరుషం గలవాడు శత్రువులు మెచ్చినదే విన్నలైన శౌర్యం. కల్పవృక్షాలను కూడా ఉదారత్వం నెరపగల దాక్షిణ్యంగలవాడు ఎన్ని గుణాలున్నా ఏమి ప్రయోజనం. విరాటుని అశ్వశాలలో ఉడిగం చేయవలసిన దుఃస్థితి సంభవించింది. అదే ద్రౌపదికి నిర్వేదాన్ని గలిగించే విషయం. పురుషకారం కంటె దైవఘటన బలవత్తరం అన్న విషయం భారతంలో పలుసార్లు ప్రసక్తమైంది. అందులో ఈ సందర్భం కూడా ఒకటి. ఇష్టజనక్లేశం వల్ల శోకభావం జనిస్తుంది. ద్రౌపది కన్నీరు నింపటానికి కారణం అదే. కరుణరసపోషణకు పదరచనలో శైథిల్యం, రచనలో రాగసరళి సహాయకారులుగా ఉంటాయనడానికి ఈ పద్యం నిదర్శనం.

వెనఁకుపఁ దనిపిన తనువు లొండొంటితో
గీలించి నిద్రించి మేలుకాంచి
తరుణులుఁ బతులు వాతాయనంబుల నల్లఁ
బొలయు వేఁబోకడి మలయపవను
నింపారు చోఁకున నిగురొత్తు చిత్తంబు
లెలిమి యొండొరులపైఁ బొలయు చూడ్కు
లాదట నుపకరణావళి వెదవెద
యాదరించుట రాగ ముడరఁ దొడరి

కేలిసలిపిరి భవన దీర్ఘికల తమ్మి
విరుల నెత్తావి నెనయంగ బెరసి చెమట
పొడము మేనుల తనికంపు ప్రోచి తలచు
టూర్పు గాడ్పుల పరిమళముల్లసిల్లి. విరాట - 2-238

విరాటపర్వంలో ప్రభాతకాల వర్ణనచేస్తూ, ఆ సందర్భంలోని వాతావరణాన్ని శృంగారోన్ముఖంగా దర్శించి తిక్కన మహాకవి పై విధంగా వర్ణించాడు. ఇది సంయోగ శృంగార స్వభావచిత్రణం. భారత కథనుంచి విడిగా ఉదాహరించి చూపడానికి వీలైన పద్యం.

అలంకారికులు శృంగారాన్ని సంయోగరూపమని, వియోగరూపమని రెండుగా విభజించినారు. అందులో వియోగశృంగారంలో అంతరాలు గమనించారు. కాని సంయోగశృంగారంలో భేదాలను భావించలేదు. తిక్కనకవి ఏ రసాన్ని వర్ణించినప్పుడైనా భావాల తీవ్రత రుచిరతను ఉద్దీపన సామగ్రిని సుష్టుగా వర్ణిస్తాడు. శృంగార వర్ణనలో అంగాంగవర్ణన చేసి 'స్తన పర్వతాలు' వంటి ప్రయోగాలు చేయడం ఆయనకు నచ్చదు. అది ప్రబంధకవులకు పరిపాటి!

కీచకుని అతివేలమైన మోహాన్ని వర్ణిస్తూ మధ్యలో ప్రభాత వర్ణనావకాశాన్ని వినియోగించి ఈ పద్యం రచించాడు. తిక్కనకవి. నిజానికి కీచకుని కామ వర్ణనపు గంజాయితోటలో ఈ పద్యం తులసిమొక్క.

శృంగారం మొదట భావైక్యాన్ని, పరిపుష్టదశలో శరీరసంయోగాన్ని వాంఛిస్తుంది. సంయోగశృంగారం తలపుల్లో, మెలపుల్లో ఎడబాటు సహించలేని దశ, దాని ఫలితమే సంశ్లేషం ఆ అనుభవసౌష్ఠవానికి మారుతం, పూలు, చందనం, చంద్రుడు ఉత్ప్రేరకాలుగా పని చేస్తాయి. ఉద్దీపనసామగ్రి సౌందర్యాన్ని వెలార్చగల్గిన వస్తువు కంటబడగానే సహృదయుడు స్పందిస్తాడు. పై పద్యంలోని రసవంతమైన భావం ఇది :

యువతీయువకులు కౌగిలింతల్లో తనిసి, సొలసి నిదురించారు. వేకువన మేలుకొన్నారు, ఉషఃకాలాన గవాక్షాల ద్వారా వీచే మలయపవనాంకురాలు స్పర్శలో వారి చిత్తాల్లో మరల రాగాంకురాలు మొసులెత్తాయి

దాని మధురమైన అనుభావాలే 'ఒండొరుల పైఁ బొలయు చూడ్కులు అంతటి భావనాతృప్తులు గనుకనే శృంగార పరిపోషక సామగ్రిని కూడా ఆదరించే స్థితిలో లేరు ఇంటిలోని నడబావుల యందలి పద్మసుగంధం వారి చెమట వాసనను పోగొట్టి మనస్సుకు హాయిగూర్చునట్లుగా ఉంది. తిక్కనకవి పాత్రల ప్రవృత్తికి అనుగుణంగా రసవాతావరణాన్ని కల్పిస్తాడు. కీచకుని జాంతవోద్రేకాన్ని దీనితో పోల్చిచూస్తే మనకీ విషయం స్పష్టమవుతుంది. తిక్కన వర్ణించిన (అమూలకమైన) కీచకుని శృంగారాన్ని నిరసించే వారు సందర్భానుగుణంగా ఆయన అమలిన శృంగారాన్ని ఎలా వర్ణిస్తాడో ఈ పద్యం చెబుతుంది.

నాయొడలు చేర్చినప్పుడ
నీ యొడలెట్లగునో ! దాని నీ వెఱిఁగెదు న
న్నే యబలల తోడిదిగాఁ
జేయదలంచితివి ! తప్పుచేసితి గంటే (విరాట-2-338)

భార్య పరాభవానికి కారకుడైన కీచకునితో భీమసేనుడన్నమాట ఇది కీచకుని మర్దించడానికి ఉపాయం ఆలోచించి నాటిరాత్రి భీముడు, ద్రౌపది నర్తనశాలలోనికి వెళ్ళడం జరిగింది. కీచకుడు అలంకరించుకొని నర్తనశాల ప్రవేశిస్తాడు భీముడు ఆచ్ఛాదితుడై ఉత్తరలీలా పర్యంకం మీద కూర్చొన్నాడు. ద్రౌపది సమీపంలో దాగి ఉంది మోహంతో ఉవ్విళ్లూరుతున్న సింహబలుడు పర్యంకం మీద కూర్చున్నది సైరంధ్రి అనుకొని. ఆమె అక్కడికి వచ్చినందుకు ముచ్చటపడి ముట్టుకున్నాడు. వాని చేయి తాకగానే భీముని శరీరం ఉప్పొంగింది. కాని ఆగ్రహాన్ని నిగ్రహించుకొని ఉద్వేగ్న చేష్టలను అణచుకున్నాడు. వలువల చాటున ఉన్నవాడు వలలుడని తెలియక వనితే అనుకొని కీచకుడు ఆస్పర్శకు పులకించిపోయాడు. రోమాంచం కలిగింది. పౌరుషచేష్టలకు, ప్రణయచేష్టలకు అంతరం తెలియని ఆ రసికుడు కీచకుడు ! 'సుందరీమణులు మోహంతో నాకు లంచమిస్తారు. నేనేనీకు బహుమతి తీసుకువచ్చానంటూ' మతిలేని స్తుతిచేసి అనంగలీలకు ఆహ్వానిస్తాడు. అప్పుడు భీమసేనుడిలా అన్నాడు : 'నా శరీరంతో నీ శరీరం కలిస్తే నీ తనువేమైపోతుందో అదినీకు తెలుస్తుంది. నన్ను సామాన్యకన్యలతో చేర్చి పలుకవద్దు - అలా అనడం తప్పు''

తిక్కన ధ్వనిపూర్వకంగా రచించిన పద్యాల్లో ఇది ఒకటి ఆమాటను కీచకుడు ఊహించిన తీరువేరు సహృదయునికి స్ఫురించే అర్థం వేరు.ఆమె శరీరైక్యాన్ని కోరుకుంటున్నదని ఆ చపలుని తలంపు ముష్టియుద్ధంలో నీశరీరాన్ని ముద్దచేస్తానని వలలుని ఉద్దేశం. అబల శబ్దాన్ని తిక్కనగారు స్త్రీ పరంగా సాభిప్రాయంగా వాడటం జరిగింది. తనను స్త్రీగా భావించేసరికి భీమునికి క్రోధం హెచ్చింది. భీముని నోట వచ్చిన ఈ మాట చమత్కారంగా రాణించింది. వీరరౌద్రమూర్తియైన భీముని నోట ఇటువంటి పలుకులు వెలువడటం చమత్కారం ! వ్యాస భారతంలో 'దిష్ట్యాత్వం ధర్మనీయోఽసి దిష్ట్యాత్మానం ప్రశంససి, ఈ దృశస్తు త్వయాస్పర్శ. స్పృష్ట పూర్వో న కర్హిచిత్.' అని ఉంది. తిక్కనకవి ఈ శ్లోకాన్నికి ధ్వన్యాత్మకంగా తీర్చి సందర్భాన్ని సమలంకరించారు,

మనకీచకులకెల్ల మారియైపుట్టిన
సుదతిపోయెడినని చూచువారు
నద్దిరా నీకుఁ గ్రొవ్వులుగ దేఁజూతుగా
కని తలచూపక యడగువారు
నలవోకగనుఁగొని యంతరంగము బిట్టు
బెదర మాఱు మొగంబు పెట్టువారు
నెదురగా వచ్చిన నెంతయేనియు దవ్వుఁ
గలుగ వేఱొక త్రోవఁ గొలగువారు
ముట్టఁబడి మేనఁ గంపంబు పుట్టనొదిఁగి
యుండువారుఁ గరంబున నుదరమప్ప
ళించి యమ్మరో రక్కెస యంచు నుల్లి
మలుకు వారునై పురజనంబుల తలంకి (విరాట-3-87)

కీచకుని భీముడు సంహరింపగా విరాటనగరంలో వింతభయం కలిగింది. ద్రౌపది ఏదో మహామూర్తి అనుకొన్నారు జనులు. నగరవీధుల్లో ద్రౌపది కనబడితే చాలు జనం చెల్లాచెదరై పారిపోయేవారు. ఆ అనుచితరీతిని బలవంతంగా తిక్కన హాస్య రసస్ఫోరకమైన పై వర్ణన చేశారు. కీచకుడు చచ్చినచావుతో ఉపకీచకులకు తెలివిరాలేదు, తమ అన్నశవంతోపాటు ద్రౌపదిని సజీవంగా దహించటానికి పూనుకొన్నారు ఆ ప్రయత్నంలో భంగపడి మృతిచెందారు. అది విరాటనగర పౌరుల్లో భయాందోళన రెట్టింపుజేసింది ద్రౌపది. ఎదట కనిపిస్తేచాలు మన కీచకులను చంపిన మహామారి అని తలచేవారు కొందరు. ఆమె వీధిలో పోతున్నప్పుడు చూచేవారిని చూడవద్దని వారించే వారు కొందరు అనకోకుండా ఆమెను చూచి మారు మొగం పెట్టేవారు కొందరు. ఆమె ఎదటికివచ్చి జంకుతో కాలికి బుద్ధి చెప్పేవారు కొందరు. సమీపానికి వెళ్ళి గడగడ వణకేవారు కొందరు ఆమెను చూచి రొమ్ము బాదుకుని అయ్యోరాక్షసి అని అరచే వారు మరికొందరు. ఇన్ని విధాలుగా విరాట నగరంలోని పౌరులు హడలిపోయారు. వారి వాక్కులో వికృతి, గమనంలో వికృతి చేష్టలో వికృతి, సహృదములకు హాస్యరసస్ఫోరకంగా ఉన్నాయి సామాన్యపు కృతుల మనస్థితి భీతిప్రద వస్తుదర్శనంలో ఎలా ఉంటుందో మహాకవి తిక్కన చక్కగా వర్ణించారు. విరాటనగర పౌరులు చేష్టలుచూచి ద్రౌపది విపరీతంగా

నవ్వుకొన్నదట ప్రాకృతజనులలోని అవివేకం ఈభయానికి కారణం. ఒక్కొసారి అజ్ఞానం నవ్వుతెప్పిస్తుంది. నాటకీయతలోని విన్నాణం తెలిపిన తిక్కనకవి దృశ్యాన్ని ఎట్లా కన్నుల కట్టిస్తాడో చూపడానికి ఈ పద్యం చాలు.

తమ భావానికి అనుభావాలు ఎందరో ఎన్నోరకాలుగా వర్ణించారు. ఇంత స్వభావోక్తిరమ్యంగా అనుభావవర్ణన చేసినవారు అగవడరు.

> అజ్ఞులు కొంద ఱప్పు డుపహాసము సేయుచు గూఢరూప రే
> ఖాజ్ఞతలేమిఁ దద్వికృతకాయము మీఁదను దృష్టి నిల్పఁగాఁ
> బ్రాజ్ఞులు మూర్తిసౌష్ఠవము బాహులదీర్ఘతయుం బటుత్వ త
> త్త్వజ్ఞతయున్ గతిస్ఫురదుదాత్తతయుం గని సంశయంబుతోన్
>
> (విరాట - 4 - 74)

ఉత్తరగోగ్రహణం చేయటానికి విజయుడు వచ్చాడు. అయితే విజయుడు విజయుడుగా రాలేదు. బృహన్నలగా వచ్చాడు. అటువైపు మోహరించిన కౌరవసేనను, ఇటువైపు ఒక చిత్రరూపుడు, భీరుకుడు కనిపించారు, విస్తారమైన కురుసేనను ఎదిరించడానికి వచ్చిన ఇద్దరే - వింతగా ప్రవర్తిస్తున్నారు. పిరుని వేషం ధరించినవాడు జారిపోతున్నాడు. విచిత్రవేషధారి అతన్ని నిలువరిస్తున్నాడు. కౌరవసేనలోని స్థూలబుద్ధులు సూక్ష్మబుద్ధులు, ఆ ఇద్దరెవరో గుర్తించడానికి ప్రయత్నిస్తున్నారు. అజ్ఞాతంలో కొందరు నివురుగప్పిన నిప్పులా ఉన్న బృహన్నల రూపరేఖలను వికృత శరీరాన్ని అపహసిస్తున్నారు. ప్రాజ్ఞులు వికృతవేషం మాటున భాసిస్తున్న రూపసౌష్ఠవతను, ఆజానుబాహులను, యోధలక్షణాలను నడకలోని నాణ్యతను పరిశీలించి ప్రస్తుతిస్తున్నారు. 'ఆ కారైః ఇంగితైః జ్ఞాయతే అంతర్గతం మనః' అంటారు, Face is the index of she mind' అన్న మాట ఒకొసారి మోసంచేయవచ్చు కాని ఆకారం చేష్టలు, నడక నరుని నాణ్యతను వెలకడతాయి.

ఉత్పలమాల పద్యంలోని రెండు పాదాలలో ప్రాజ్ఞుల అభిప్రాయాలను, మరి రెండు పాదాలలో ప్రాజ్ఞుల ఉద్దేశ్యాలను పొదెగి అతడు అర్జునుడు అగునా ? కాదు అన్న భావానికి సమసంఘర్షణ కల్పించి వాక్యయోజనంలోను శిల్పం మెరిపించాడు తిక్కన కవి. తిక్కనకవి మేధావి. ఎంత సౌందర్యపిపాసియో అంత వివేకశీలి.

మేధావి తనలోని విమర్శనగుణాన్ని పై పద్యరచనలో పొందుపరిచిచూపాడు. దుష్కరప్రాసను ప్రయోగించి ప్రాసస్థానం పై ఊనిక చూపి జ్ఞా ధాతువును శక్తిమంతంగా సాభిప్రాయంగా వాడి చూపాడు.

లోకంలోని వ్యక్తుల స్థూలబుద్ధికి, పండితుల సూక్ష్మేక్షితకు తిక్కనకవి అంతరాన్ని చూపెట్టాడు పాత్రచిత్రణకు ఇట్టి విశ్లేషణ ఒక అంగం. ఈ రచన తిక్కన స్వోపజ్ఞం. మూలంలేనిది 'సైనికాః ప్రాహసన్ కేచిత్తధాతురూపమవేక్ష్యతమ్' ఇంతమాత్రమే మూలంలో ఉంది (భండార్కరు ప్రతి) దీనిని మెరుగుపెట్టిచూపాడు మహాకవి.

వెలవెలఁ బాఱుచు వెగడొందుఁ బెదవుల
తడియాఱ నెంతయుఁ దల్లడిల్లు
జల్లన నంగంబు లెల్ల నిండఁ జెమర్పఁ
బదములు కరములుఁ బడియవడఁకు
హృదయంబు తటతట నదరంగఁ బెలుకుఱు
దీనదృష్టులమోము తేలిచూచు
నెలుఁగు గద్గదికఁ దొట్రిల నేడ్చు విడుమని
ప్రార్థించు మఱుఁగిడ్డాపటు దోఁచి

నిష్కశతశుద్ధ హేమంబు నిర్మలోజ్జ్వ
లాష్టవైడూర్యములుఁ దురగాఢ్యరథముఁ
గంటి దశకమ్ము నొకయూరుఁ బురము నొచ్చి
నపుడ యిచ్చెద నీ కను నార్తుఁడగుచు (విరాట - 4 - 80)

కౌరవులను చూచి భీతుడై ఉత్తరుడు రణరంగంలో నిలువడానికి జంకి బృహన్నలకు లంచంపెట్టి పారిపోజూస్తున్నాడు. తొందరపాటే తప్ప నిలుకడ ఎరుగని చంచలుడు ఉత్తరుడు. 'వేరమ్ము' అని బృహన్నలను పిలిచి 'సత్వరంబున' కవచాన్ని తాడుకొని రయమున సిడమెత్తుము అని ఆజ్ఞాపించి, 'రయంతో బున' రథాన్ని తోలమని ఆనతిచేసివచ్చి అక్కడి యోధులను చూచి 'రయంబున తేరు మరల్పుము' అంటాడు బృహన్నలతో. బృహన్నల 'రయమ్మున' వచ్చి 'భయమ్మున' పారిపోవడం పద్ధతి కాదని మేలపుతారు. రథం దూకి పారిపోతున్న ఉత్తరుణ్ణి వెంబడించి నిలువరిస్తాడు. అప్పుడు ఉత్తరుని పరిస్థితి ఎలా ఉందో పై సీసపద్యపాదాల్లో. ఎమన్నాడో తేటగీతిలో వర్ణించాడు మనిషి భయపడ్డప్పుడు

చిత్తం ఎన్ని విధాల కంపిస్తుందో ఆ ఖానాంబరాలను చూపగలనేర్పు ఆయనకు జన్మతో అనుభవం. భీతుడైన ఉత్తరుడు తెల్లమొగంవేశాడు చీకాకుపడ్డాడు, పెదవులు ఎండిపోయినవి గబులువుట్టింది. శరీరాంగాలకు చెమటపట్టినది, కాళ్లుచేతులు వణుకుతున్నాయి, గుండె తటతటమని కొట్టుకుంటున్నది. దిక్కుమంటూదిక్కుల చూస్తున్నాడు పారిపోవటానికి వేదనాస్త్ర్రి సాధనంగా ఉత్తరుడు ఉపయోగించాడు. అయినా బృహన్నల వదలిపెట్టలేదు ఇక లాభం లేదనుకొని నూరు నిష్కాల బంగారం ఇస్తానన్నాడు ఉజ్వలంగా ఉన్న అష్టవైడూర్యాలు ఇస్తానన్నాడు. అది చాలకపోతే పది ఏనుగులు ఇవ్వగలనన్నాడు ఎప్పుడో కాదు నగరానికి వెళ్ళంగానే తప్పక ఇస్తానన్నాడు. ఉత్తరుని మిషగాచేసుకొని లోకంలోని భీరువుల చిత్తవైకల్యాలను చిన్మయంగా వర్ణించిచూపాడు సోమయాజి. తిక్కనకవి భావపరంగా వాడిన క్రియాపదాలకు అర్థం చెప్పలేక నిఘంటువులు తడబడ్డాయి.

ఉత్తరుడు ఇక లాభం లేదనుకొని మరొక ఉపాయాస్త్రం ప్రయోగించాడు 'మా అమ్మ నాకోసం ఎదురుచూస్తూఉంటుంది. నన్ను వెళ్ళనీ అని.

మూలభారతంలో ఇంతకంటె హాస్యస్ఫోరకమయిన మాటలున్నాయి. ఎందుకో తిక్కనగారు వాటిని తెలిగింపలేదు. తానుచూచిన ప్రతిలో లేవేమో ఉత్తరునకు బృహన్నలతో క్షీరంవా దధిం వా ఆజ్యంవా తక్రంవా న పిబామ్యహం, ఆ రనాశం హి పాస్యామి నమే గోభిః ప్రయోజనం' అంటాడు పాలుగాని, పెరుగుగాని, నేయిగాని, చల్లగాని, నేను త్రాగను, కేవలం చలిఅంబలినే తాగుతాను-అందువల్ల నాకు గోవులతో పనేమి - వెళ్ళిపోతాను' అని అయితే భండార్కరు ప్రతిలో పై శ్లోకానికి అధోగతి (Foot-note) పట్టింది. ప్రక్షిప్తమని భావించి అడుగును వినిరివేశారేమో! ఒక్కొకసారి ప్రక్షిప్తాలే అసలైనపాఠం కంటె బాగాఉండటం మన దురదృష్టం! ఏమైన మహాభారతంలోని హాస్య శంపాలతలు అనుభవించి తీరవలసినవే'

వెరవరిగాక వీడు కురువీరులకుం బొడసూపు వాడె య
ప్పేరు వొక ప్రమానిపేర నిటఁజేరఁగ వచ్చుచు నున్నవాఁ డహం
కరణము కాని యొండొకటి గానఁడు మూర్తి విశేషమారయన్
సురపతియట్ల వీనిమదిచొప్పది యెట్లొ యెఱుంగనయ్యెడున్

(విరాట-4-91)

గోగ్రహణానికి వచ్చినవాడు అర్జునుడే అని నిర్ణయించుకొని కౌరవసైనికులు కలవరపడ్డారు. గురుదేవుని మరుగుజొచ్చారు. అర్జునుడు రణానికి మోహరించి శత్రువుల ధైర్యాన్ని హరించాడు ద్రోణాచార్యునికి వచ్చినవాడెవరో అర్థమైంది. అభిమానశిష్యుడని అంతరాత్మ చెప్పింది. కాని సమయభంగం అవుతుందన్న అనుమానం ఆవహించింది. ప్రక్కనే ఉన్న గాంగేయునితో ప్రస్తావించాడు ఈ విషయం ఆ ప్రస్తావనలో ధ్వని ఉంది అది గాంగేయుని గమనిక లోనికి రావాలికాని సుయోధనునికి సుంతైనా తెలియరాదని ఆయన అభిప్రాయం అందుకే భీష్మునికి మాత్రమే వినిపించేలా ఇలా అన్నాడు.

'ఎవడో వీడు! కురువీరులతో సమరానికి వస్తున్నాడు. ప్రబుద్ధుడు! ఆ చెట్టుచాటుగా ఇటువస్తున్నాడు! అహంకారం తప్ప ఆలోచన తెలియనివాడు! రూపం దేవేంద్రుని లాగా ఉంది! ఏమనుకొని ఇక్కడికి వస్తున్నాడో తెలుసుకోవడం మంచిది!'

కయ్యానికి కలవరపడుతున్న దుర్యోధనునికి ఆమాటలుచెవిలో పడ్డా అంతకంటె విశేషం తెలియదు. నిజానికి మ్రానిపేరు అనగా చెట్టుపేరు అర్జునపదం వృక్షపరంగా వాడుకలో ఉంది. అర్జునవృక్షమనగా మద్దిచెట్టు లేక తెల్లగన్నేరు. మ్రానిపేర వస్తున్నవాడు అర్జునుడన్న ద్రోణాచార్యుని అభిప్రాయం గాంగేయునికి ధ్వనించింది 'సురపతియట్ల' అని మరో మాట ఇంద్రుని వరంవల్ల పుట్టిన అర్జును డితడు అన్న స్ఫురణ ఇందులో ఉంది అయితే సమయ భంగం చేస్తూ ఎందుకు వస్తున్నాడో అన్న గురుని సందేహానికి భీష్ముడు సమాధానం చెబుతాడు. 'వెంపరి గాక వీడు గురువీరులకుం బొడసూపువాడె' అన్న మాటలో వాత్సల్యానికి స్థాయిభావమైన ప్రేమ యుక్తమైన రతి ధ్వనిస్తున్నది. 'అహంకరణమనికాని ఒండొకటిగానడు' అన్నమాటలో అపాయశంక స్ఫురిస్తున్నది గురుశిష్యులు పోరాటానికి ఎదురైనిలిచారు, భక్తి వాత్సల్యాలకు కొరతలేదు. విద్యుక్త ధర్మానికి మారుగా మమతలు చెలరేగుతున్నాయి. బుద్ధికంటె ముందు హృదయాలు పనిచేస్తున్నాయి!

పక్షి మృగజాతు లెల్లను భ్రమసి యిట్టు
నట్టుఁగలఁగొనఁ జెదరె వృక్షాళి యదరెఁ
గురుబలంబును బెదరె నంబరము దిశలు
బూరటిల్లంగఁ దొడఁగెఁ వదార వనమున (విరాట-4-169)

వీరుని చర్యలను వివిధ రకాలుగా వర్ణిస్తే సహృదయునిలో ఉత్సాహం సమగ్రంగా ఉద్బుద్ధమవుతుంది. ఆధునికులకు ఇటువంటి రచనలు రుచింపకపోవచ్చు. కాని కవిత్వకళలో ఇది కమనీయమైన మార్గం. కథాకథనంలో ఇటువంటివి ఔత్సుక్యాన్ని అవతరింపజేస్తాయి.

విజయుడు శమీవృక్షం మీద దాచిన అయుధాలను చేకొని అధిదేవతలను ధ్యానించి బృహన్నల రూపాన్ని విడిచి దర్శనీయమైన మునుపటి రూపాన్ని పొంది. యుద్ధానికి సిద్ధమై గాండీవాన్ని ఎక్కుపెట్టి గుణధ్వనికావిస్తాడు ఆగుణధ్వని రోదసి అంతానిండి ప్రకృతిలో కోలాహలాన్ని కలిగిస్తుంది పక్షులు. మృగజాతులు గుండె లవిసి చెదరిపోయినవట! వృక్షాలు కంపించిపోయాయి! కురుసేనలో కలగుండుపడింది. ఆ ఆరావంతో దిశలు నిండిపోయినవి! అగ్నిపర్వతం బ్రద్దలైనపుడు భూకంపం కలిగినప్పుడు ఎట్టి వైపరీత్యాలు కలుగుతాయో అలాంటి లక్షణాలను వర్ణించాడిక్కడ తిక్కన కవీంద్రుడు. 'బెదరె' 'అదరె' 'చెదరె' అను క్రియలను లయాన్వితంగా వాడి కవ్వడి అల్లెత్రాటి సవ్వడిని ప్రతిధ్వనింప జేశాడు మహాకవి.

సమాసధాటి లేదు, పదరచనలో వర్గయుక్కుల ఒరవడిలేదు, భీతిభావాన్ని పృథక్పదరీతిలో రచించిన సోమయాజి రచనాదృక్పథం పరిశీలనార్హం అవసరమైనచోట సమాస సౌందర్యంతో అర్థస్ఫురణ కలిగిస్తాడు, విరాటపర్వంలో గుణధ్వని, దేవదత్తశంఖారావాలను ఎన్నోమార్లు, ఎన్నోతీరుల మార్చిమార్చి వర్ణించాడు మహాకవి. అవి పఠించి పరిశీలింప వలసిన పట్లు

ఈ పద్యానికి ఉన్న మూలం ఇది.

సనిర్ఘాతా శివద్భూమి ర్దిక్షు వాయుర్వవౌ భృశమ్.
భ్రాన్తద్విజం ఖం తదాసీత్ ప్రకమ్పిత మహాద్రుమమ్
తం శబ్దం కురవోఽజాన న్విస్ఫోటమశనే రివ
యదర్జునో ధనుః శ్రేష్ఠం బాహుభ్యామాక్షిపద్రథే

(భండార్కరు ప్రతి)

తిక్కన మహాకవి ఇక్కడ మూలానికి మెరుగులుదిద్దాడో తరుగులు మాపాడో ఆలోచింపవలసింది సహృదయులు.

కలఁగెం దోయధిసప్తకంబు గిరివర్గంబెల్లనూటాడె సం
చలతం బొందె వసుంధరావలయ మాశాచక్రమల్లాడెఁ గొం
దల మందెంద్రి దశేంద్రు పట్టణము పాతాళంబు మూర్ఛిల్లె నా
కులమయ్యెన్ గ్రహతారకా కులము సంక్షోభించె నవ్వేధయున్
(విరాట - 4 - 172)

ఇంతకు ముందు పద్యంలో విన్నది గుణధ్వని. ఈ పద్యంలో వింటున్నది శంఖధ్వని. దీనికి మూలం లేదు. ఇలాంటి వర్ణనలలో చాలావరకు తిక్కన సవ్యసాచియైపోతాడు. దేవదత్తాన్ని పూరించి అర్జునుడు విశ్వాతంరాళంలో అలజడి సృష్టించాడు ఆశంఖధ్వనితో సప్తసముద్రాలు కలతపడ్డవి, పర్వతపంక్తులు ఊగిసలాడినవి, భూచక్రం కంపించిపోయింది. దిశాచక్రం అల్లల్లాడింది-అంతేకాదు అమరావతిలో అల్లరిపుట్టింది, పాతాళంలో పరాకు కలిగింది. గ్రహతారకల్లో గందరగోళం రేగింది బ్రహ్మ అదరిపోయినాడు!

విజయుని పరంగా వీరరసాన్ని వర్ణించాలి మహాభారతంలో నాయకుడు ధర్మరాజు. అనగా ధర్మప్రతీక భీమార్జునులు ఆధర్మాన్ని ఉద్ధరించటానికి ఉత్సాహశక్తులు. ధర్మ ప్రతిష్ఠాపనం ప్రయత్నసాధ్యం. ప్రయత్నానికి ఉత్సాహం మూలం ఉత్సాహం ఎలా ఉరకలు పెడుతుందో ఇటువంటి వర్ణనలు తెలుపుతాయి.

వీరుడైనవాడు రణరంగలో, శత్రువుల్లో భీతిసృజించడానికి ప్రయత్నం చేస్తాడు. వీరుడైన విజయుడు అలాగే చేశాడు. సమరానికి సన్నద్ధులై వచ్చిన కౌరవులకు అటుప్రక్క ఉన్నవారెవరో తెలియక సందిగ్ధత ఏర్పడినప్పుడు ఈ విధమైన శంఖధ్వానంతో వచ్చింది భీభత్సుడని తేలిపోయింది! ఇక తేలవలసింది కౌరవుల పౌరుష మెంత అనేది! పదమూడేడ్లు కష్టాలు పడి, కష్ట కారకులులైన వారిపై కయ్యానికి కాలుదువ్వడానికి ఇంత ప్రచండంగా విజయుడు ఉద్యమించడంలో ఆశ్చర్యంలేదు లోకంలో మానవులు ఉత్సాహంతో ఉప్పొంగినపుడు వాళ్ళ ప్రవృత్తి ఎలా ఉంటుందో తిక్కనకు తెలుసును గనుక ఈ రుచిర వర్ణనం చేశాడు.

కాంచనమయవేది కాకనత్కేతనో
జ్జ్వల విభ్రమము వాఁడు కలశజుండు
సింహలాంగూల భూషిత నభోభాగకే
తు ప్రేంఖణము వాఁడు ద్రోణసుతుండు

కనక గోవృషసాంద్ర కాంతి పరిస్ఫుట
ధ్వజసముల్లాసంబు వాఁడు కృపుడు
లలితకంబుప్రభాకలిత పతాకావి
హారంబు వాఁడు రాధాత్మజుండు
మణిమయోరగ రుచిజాల మహితమైన
పడగవాఁడు కురుక్షితిపతి మహోగ్ర
శిఖర ఘనతాళ తరుహాసిదమువాఁడు
సురనదీసూనుఁడేర్పడఁ జూచికొనుము. (విరాట - 5 - 4)

ఉత్తరుడు తనను ఎన్నాళ్ళుగానో అర్జునునికి సారథ్యంచేయాలనే కోరిక ఉందని ముచ్చటగా వెల్లడించాడు అదృష్టవశాత్తు ఆ అవకాశం వచ్చింది అయితే కౌరవులను ఉత్తరుడు చూడలేడు, చూచినా గుర్తించలేడు. సారథికి ఆహవరంగంలో ఎవరుఎవరో తెలియాలి. అందుకే అర్జునుడు కౌరవ యోధులను వారి చిహ్నలతో సహా పరిచయంచేస్తున్నాడు. జెండాపై స్వర్ణమయమైన యజ్ఞవేదిక గుర్తుగలవాడు ద్రోణాచార్యుడు, సింహపు తోక గుర్తు జెండా గలవాడు అశ్వత్థామ. బంగారు గోవృషభముల గుర్తుగల కేతనం గలవాడు కృపాచార్యుడు. అందమైన శంఖ చిహ్నంగల ధ్వజంవాడు రాధాసుతుడైన కర్ణుడు. మణులతో పటంచేయబడి సర్పధ్వజం గలిగినవాడు సుయోధనుడు. భీకరమైన శిఖరంగలిన తాళధ్వజంగలవాడు గాంగేయుడు" అని ఉత్తరునికి అర్జునుడు కురు యోధులను పరిచయంచేశాడు.

మొదట పేర్కొబడ్డవాడు ద్రోణాచార్యుడు, చివర చెప్పబడినవాడు భీష్మాచార్యుడు. వక్త అర్జునుడు. కనుక అర్జునుని దృష్టిలో ఆ వైపున ఉన్న వారిలో ఈ ఇద్దరే ప్రధానులని తక్కినవారు చేవతగ్గిన వారన్న ఉద్దేశం ధ్వనిస్తున్నది. పాదాలు వేనికవే విశ్రాంతి పొంది లయమాధురిని వెలారుస్తున్నవి. రెపరెపమంటున్న వీరవరేణ్యుల పతాకాంచలములకు తిక్కన వాడిన పదాలు 'విభ్రమము, ప్రేంఖణము, సముల్లాసము, విహారము'. వీటి అర్థాన్ని గమనిస్తే అర్జునుడు ఉత్సాహతారళ్యం విశదమవుతుంది.

వీరుడైనవాడు వీరులను సగౌరవంగా సంభావించుట ధర్మం. అర్జునుడు శత్రుయోధులను సగౌరవంగా పేర్కొన్న తీరు ఆతడు దీరోదాత్తుడన్న విషయాన్ని వ్యంజిస్తున్నది అర్జునుని వీరగుణాన్ని రంజింపజేస్తున్నది.

ఏనుంగునెక్కి పెక్కేనుంగు లిరుగడ
రాఁబుర వీధులఁ గ్రాలఁగలదె
మణిమయంబైన భూషణ జాలముల నొప్పి
యొడ్డోలగంబున నుండఁగలదె
కర్పూర చందన కస్తూరికాదుల
నింపుసొంపార భోగింపఁగలదె
యతి మనోహరులగు చతురాంగనలతోడి
సంగతి వేడ్కలు సలుపఁగలదె
కయ్యమున నోడిపోయినఁగౌరవేంద్ర
వినుము నా బుద్ధి పరలి యాతనువు విడిచి
సుగతి వడయుము తొల్లింటి చూఱఁగలదె
జూదమిచ్చటి నాడంగరాదుసుమ్ము (విరాట - 5 204)

వనవాసం అధిగమించి అజ్ఞాతవాసం నిస్తరించి అనుకూల్యాన్ని గమనించి అవకాశాన్ని ఉపయోగించుకొని సమరానికై వచ్చిన శత్రువును చూచి ఉత్సాహ భరితాంతఃకరణంతో రణానికి సిద్ధపడ్డ సవ్యసాచి వీర వచస్సు ఈ పద్యం. సుయోధనునితో సమరం చేయడం అర్జునునికి క్రీడాప్రాయం. బలగాన్ని వెంట బెట్టుకొని ఏకవీరునిపై బలప్రదర్శన చేయడానికి వేంచేశాడు సుయోధనుడు. అయినా క్రీడి జంకలేదు వీరునికి రణసీమ స్వర్గసీమ వంటిది. కావున అర్జునుడు ఉత్తేజంతో సుయోధనుణ్ణి అధిక్షేపిస్తున్నాడు. ఎదుటి వాణ్ణి మెచ్చుకొంటూనే నొచ్చుకొనేలా చేయటం అధిక్షేప లక్షణం. 'కౌరవేంద్రా, కయ్యంలో ఓడిపోతే ఏనుగుపై ఎక్కి ఊరేగడానికి వీలుకాదు. మణిమయభూషణాలు ధరించి సభ చేయడం సబబుకాదు. పరిమళద్రవ్యాలను పసందుగా అనుభవించడానికి అవకాశం ఉండదు. సుందరీమణుల సాంగత్యంలో సౌఖ్యాలు పొందడానికి పొసగదు - నామాటవిను తనువు చాలించి పరువు నిలుపుకో - ఇంతకు ముందు లాగా మోసంచేసి మీసం దువ్వడం ఇకసాగదు - ఇది జూదము కాదు - కయ్యము అని అర్జునుని అధిక్షేపణ. అర్జునుడి వాడిములుకుల కంటె పోటిమిగల పలుకులు సుయోధనుని గుండెను దూసుకుపోయి ఉంటాయి. అందుకే పాపం తడబడ్డాడు.

నన్నయగారు పద్యాన్ని లయాన్వితంగా రచిస్తారు. ఆయన పద్యం పఠనంతో అప్రయత్నంగా రాగరంజితంగా ఉంటుంది, తిక్కన కవి పద్యంలో

వచనగంధం భాసిస్తుంది. వీరరస విశిష్టమైన సందర్భాల్లో తిక్కన పద్యం సైతం ఉత్సాహంతో రాగరమ్యంగా రచిస్తుంది. అలాంటి పద్యాలు అరుదైనా బిరుదుగలవే.

అంతరంగంబు నిండి రెండలువులందు
వెడలు సంతోష పూరంబు వెడలు దోఁపఁ
గన్నుఁగవ సమ్మదాశ్రులు గడలుకొనుఁచు
గండ పులకాంకురముఁ తోఁ గమ్మదేర (విరా - 5 - 240)

ఉత్తరుడే కౌరవులను జయించి గోగణాన్ని మళ్లించాడని విరాటుని వెర్రి విశ్వాసం బృహన్నల రూపంలో ఉన్న అర్జునుడే అసలైన కారణమని తెలియదు తన కుమారుడు ఒంటరిగా కౌరవులను జయించి వచ్చాడన్న వార్తవిని సంతోషం పట్టలేక ఉక్కిరిబిక్కిరయి ఉత్తరునిపై వాత్సల్య వర్షాన్ని కురిశాడు. ఆ రేడు. ఉత్తరునిగెలుపు ఊహింపని సంఘటన; తలచి యెరుగనిఫలం. ఆ స్థితిలో విరాటునికి వివేకం పనిచేయదు, అనుమానానికి ఆస్పదముండదు. అందుకే విరాటునిలో వెల్లివిరిసిన వాత్సల్య రసస్థితి ఈ విధంగానే ఉంటుంది ఆనందంతో అంతరంగ సరోవరం నిండి రెండుకన్నులనే అలుగులద్వారా కాలువారుతున్నదట విరాటుడు తాను దక్షిణగోగ్రహణంలో పొందిన జయానికి, పుత్రవిజయం కూడా తోడై ఆత్మానంద-ఆత్మజానంద పారావశ్య స్థితిలో పరాకు పడ్డాడు.

తిక్కన మహాకవి రసోచితంగా అనుభావవర్ణన చేశాడు. కావ్యంలోని చేష్టావర్ణన సహృదయునిలో రసోద్దీపనానికి సహకారి. అశ్రుపాతాన్ని రోమాంచాన్ని వర్ణించి విరాటుని మనఃస్థితికి భాష్యం చెప్పాడు. విరాటుని కనుదోయిలో సమ్మదాశ్రులు నిండినవట! తన విజయం కుమారుడు గెలిచాడన్న భావన వల్ల గర్వం అనే భావాలకు స్ఫోరకంగా తిక్కనకవి సమ్మద శబ్దాన్ని ప్రయోగించాడు.

పుత్రుల విజయానికి తండ్రులెలా పులకించి పోతారో లోకంలో అందరికీ తెలిసిందే ఉత్తరుని వంటి పుత్రుని ప్రవర్తన తండ్రికి శాశ్వతగౌరవాన్ని కలిగింపదు.

నీ విటమున్న వచ్చితివి నిక్కము పార్థునిఁదొల్తఁగాచితిం
గావున మీకు నిద్దఱకు గౌరవ మొప్పగఁ దోడుపాటు స

ద్భావము దీనికిం దెలుఁగు దప్పక యుండగ నేర్పరించెద
న్మీ వలపెట్టు లట్టితగ నీవును నీతఁడుఁ గోరికొండొగిన్.

(ఉద్యోగ - 1 - 72)

ఉత్తరాభిమన్యుల కళ్యాణంతో విరాట పర్వం ముగిసింది. కౌరవపాండవులు స్పర్ధల దృష్ట్యా సమరం తప్పదనుకున్నారు. సైన్యబలం వాళ్లు పెంచుకునే ఉద్యోగంలో ప్రయత్నంలో - ఉన్నారు. అటు సుయోధనుడు, ఇటు విజయుడు ఒకేసారి బలసహాయం కోసం కృష్ణుణ్ణి అర్థింప వచ్చారు. మొదట వచ్చిన సుయోధనుడు పవళించిన కృష్ణుని తలావి దెస ఆసనం మీద కూర్చున్నాడు. తరవాత వచ్చిన అర్జునుడు కాళ్ళ వైపున్న ఆసనంలో కూర్చున్నాడు. ఆ సీవ స్థానాలు వారి ప్రవృత్తులను తెలుపుకున్నాయి సుయోధనునిలో రాజసానికి ఈడయిన ఉచితానుచిత పరిజ్ఞానం కనిపించడంలేదు.

నిద్రించి లేచేవారు మొదట కాళ్ళవైపు చూస్తుంటారు. కృష్ణుడు అలాగే చూశాడు - కనిపించింది కాళ్ళవైపు కూర్చున్న సవ్యసాచి. ఆతన్ని పలుకరించి మరోవైపు చూడగా సుయోధన సార్వభౌముడు కంటబడ్డాడు. ఆయనను ప్రసన్నంగా పలుకరించాడు.

వచ్చిన పనిని గురించి ప్రస్తావించాడు కృష్ణుడు. సుయోధనుడు 'కయ్యానికి సాయం చేయమని అడుగవచ్చాం. నేనే ముందు వచ్చాను. మంచివారు ముందు వచ్చినవారిని ఆదరించి సాయపడతారు. కనుక నీవు నాకు సాయం చేయాలి' అన్నాడు. కృష్ణుడు 'నీవు ముందే వచ్చావు-కానీ నేను ముందు అర్జునుని చూచాను అయినా మీ ఇద్దరికీ సాయంచేయుటం నాధర్మం. అందుకేదైనా ఉపాయం ఆలోచిస్తాను. మీకు నచ్చింది మీరు కోరుకొనండి' అని అంటూ 'తొలితొలి గోరికొనం బాలుని కిందగు - అదిపాడి' అని సూచించాడు కృష్ణుడు రాజకీయ వ్యవహారధురంధరుడు పైగా వాగ్మి. ఎదటివాని సత్వాన్ని నిమిషంలో ఊహించి ఎత్తుకు పైఎత్తు వేయగలడు.

ఈ పద్యానికి మూలం ఉండు తిక్కన కపిఇంచిమించుగా దానినే అనువదించాడు చూడండి :

'భవానభిగతః పూర్వమత్ర మే నాస్తి సంశయః,
దృష్టస్తు ప్రథమం రాజన్మయా పార్థో ధనంజయ.

తవ పూర్వాభిగమనాత్పూర్వం చాప్యస్య దర్శనాత్,
సాహాయ్యముభయోరసి కరిష్యామి సయోధన.''

భండార్కరు ప్రతి

వ్యాసభారతభాగం తన మనసుకు నచ్చి నప్పుడు దానిని యథాతథంగా అనువాదం చేయటం తిక్కనకు అభీష్టమే. అటువంటి వానిలో ఇది ఒకటి

తిరుపతి వేంకట కవుల పాండవోద్యోగంలో ఈ పద్యం ఇలా ఉంది:

'ముందుగ వచ్చితీవు మునుముందుగ నర్జును నేను జూచితిన్
బందుగులన్న యంశమున సాయకనిల్పె సహాయమిర్వురన్
జెందుట పాడి; మీకునై చేసెద సైన్య విభాగ; మందు మీ
కుందగు దానిగైకొనుడు, కోరుట బాలుని కొప్పు ముందుగన్

ముగ్గురు కవులు ఒకే సందర్భం ఎలా రచిస్తారో ఈ కూర్పు తీర్పు చెబుతుంది.

అల్పులకు మ్రింగఁ జేదైన హాలహలము
భంగిఁ బొంగెడు కోపంబు మ్రింగికొనఁగ
నీలగళునెన్ని సన్నెన్నబోలు నట్టి
నీవు చాలినఁగా కెల నెగడఁ లేరు. (ఉద్యోగ - 1 - 334)

ధృతరాష్ట్రుడు సంజయుణ్ణి పాండవుల వద్దకు రాయబారం పంపాడు. పాండవులపై ఆయనకు ప్రేమాభిమానాలు ఉన్నవి. కాని చక్రవర్తిగా తానే. తగవు తీర్చి కచ్చితంగా సభలో తీర్మానం చెప్పగల మనః స్థైర్యం లేదు అన్యాయం అని అరవగలడే కాని, దానిని నివారించే నైతికబలం ధృతరాష్ట్రునికి లేదు సంజయుని రాయబారిగా పంపి ధర్మజునికి నీతి బోధచేయించి 'ఇది మా దురదృష్టం' అనుకునేటట్లు చేయాలని అతని ఆరాటం సంజయుడు ధర్మరాజు వద్దకు వెళ్ళి చెప్పవలసిన సంగతులు వల్లించాడు. చివర' బంధుల గురులన్ వెదకి వధించుసౌఖ్యంబేటికి' అని ప్రస్తావించి 'అల్పులు హాలాహలం వంటి కోపాన్ని మ్రింగుకోలేరు. నీవు పరమేశ్వరుని వంటి వాడవు పరమేశ్వరుడు హాలాహలాన్ని కంఠంలో దాచుకొన్నట్లు శత్రుకృతాపరాధజన్య క్రోధాన్ని హృదయంలో దాచుకోగలవు. శాంతానికి నీ పేరు చెప్పి మరొకరి పేరు చెప్పాలి. అని పొగడుతాడు ఏమి పనిచేయనిచోట పొగడ్త గొప్పగా పనిచేస్తుంది. వికార హేతువున్నా ధీరుడు

చలింపడు. ధర్మరాజు పిల్లగా 'నీవు నన్ను విమర్శించాలనకుంటే ధర్మాధర్మాలు మాట్లాడు' అని సంజయుని నిరుత్తరుణ్ణి చేస్తాడు. తిక్కనకవి నీలగళశబ్దాన్ని సాభిప్రాయంగా ప్రయోగించాడు.

ధర్మజుండు. ధర్మతరు వర్జునుఁడు ఘన
స్కంధ మనిలసుతుఁడు శాఖ కవలు
పుష్పఫలము లేను భూసురులును వేద
ములుఁ దదీయమైన మూలచయము.

(ఉద్యోగ-1-356)

రాయబారానికి వచ్చిన సంజయుని మాటలు విన్నాక ఆ మాటల అంతరార్థం గ్రహించి చెప్పవలసిందేదో చెబుతున్నాడు శ్రీకృష్ణుడు. సంజయుడు పాండవులను శాంతించమంటున్నాడే కాని పరిష్కృతిని పలకడంలేదు. ఆనాడు సభలో కర్ణుడు 'నీకు తగిన మగణ్ణి ఇంకొకణ్ణి కోరుకో' అని చెప్పడాన్ని దుర్యోధనుడు దుశ్శాసనుడు పలికిన తుంటరి పలుకులను తడివి చికిత్స జరుగగలదన్నాడు శ్రీకృష్ణుడు సంజయునితో.

ధర్మజుడనే వృక్షానికి అర్జునుడు బోదె. భీముడు కొమ్మ. నకులసహదేవులు పుష్పఫలాలు. నేను, బ్రాహ్మణులు, వేదాలు వేరు అని అంటున్నాడు కృష్ణుడు. వేరులో ప్రాణశక్తి ఉంటే చెట్టు ఆరోగ్యంగా ఉంటుంది. ఈ ధర్మతరువు వేదమూలం. ఇక ఆ ధర్మానికి క్షతి ఉండదు. స్థూలదృష్టికి కృష్ణుడు పాండవపక్షపాతి అనిపిస్తుంది. కాని తన మనసులోని మాటను కృష్ణుడు స్పష్టంచేశాడు ధర్మో రక్షతి రక్షితః అన్నది భారతకథా సారాంశం.

రోషమయ మహాతరువు సుయోధనుఁడురు
స్కంధ మందులోనఁ గర్ణుఁడలరుఁ
గొమ్మ సౌబలుండు కుసుమఫలములు దు
శ్శాసనుండు మూలశక్తి తండ్రి

'దుర్యోధనుడు రోషమయమైన వృక్షము, ఆ వృక్షానికి కర్ణుడు బోదె, శకుని కొమ్మ, దుశ్శాసనుడు కుసుమఫలాలు, వేరు ధృతరాష్ట్రుడు' అధర్మాన్ని నివారించటానికి అధికారం కలిగిఉండి పుత్రవ్యామోహంతో మిన్నకున్నాడు. ఇరు పక్షాలను

వృక్షాలతో పోల్చి తారతమ్యాన్ని నిరూపించి, తత్త్వాన్ని చెప్పాడు శ్రీకృష్ణుడు. చివరకు 'కురువంశవనంలో పాండవులు సింహాలని, సింహరహితమైన వని నిర్మూలనం తప్పదని' తేల్చి చెప్పాడు కృష్ణుడు. ఈ రెండు పద్యాలు నాయక ప్రతినాయకుల జీవనిష్ఠమైన గుణాన్ని వ్యక్తంచేస్తున్నవి.

బలవంతుడు పైనెత్తిన
బలహీనుడు ధనముఁగోలుపడిన యతఁడు క్రము
చ్చిల వేచువాఁడు గామా
కుల చిత్తుడు నిద్రలేక కుందుదు రధిపా

(ఉద్యోగ-2-21)

సంజయుడు పాండవులవద్దకు రాయబారిగా వెళ్ళివచ్చాడు. ధృతరాష్ట్రుడు అక్కడి సంగతులను గురించి తెలుసుకోదలచాడు. అక్కడి వారికి ధృతరాష్ట్రదుల పై ఎలాంటి అభిప్రాయముందో సంక్షిప్తంగా వివరింపగలనని చెప్పి సెలవు తీసుకున్నాడు సంజయుడు.

సంజయుడు తెలిపిన విషయం కన్నా, తెలుపవలసిన విషయం తీవ్రంగా ఉంటుందని ఊహించి కంగారుపడి వెంటనే విదురుని పిలిపించుకొని 'సంజయుడు నన్నునిందించి రేపు వచ్చి తక్కిన విషయాలు వెల్లడిస్తానని వెళ్ళిపోయాడు. శరీరం నిప్పుల్లో పొరలినట్లుగా ఉంది, నిద్రరావడం లేదు.అని వివరిస్తాడు విదురుడు. సూటిగా 'బలవంతుడు దండెత్తివస్తే బలహీనునికి నిదుర రాదు. ధనం పోగొట్టుకున్న వారికి నిదురరాదు. దొంగతనంచేయడానికి కాచుకొన్నవారికి, కామంచేత పీడింపబడేవారికి నిదురరాదు ఇతరులసొమ్ము అపహరించదలచిన వానికి నిదురరాదు' - ఈ కారణాల్లో ఏకారణం నిన్ను పీడిస్తున్నదో చెప్పవలసిందని అడుగుతాడు విదురునికి ధృతరాష్ట్రుని పై ఖరితెలుసును. నీతులు వినటమేకాని పాటించిన పాపాన పోడని తెలుసును. ఆధిభౌతిక వ్యాధికి చికిత్సకుడు కారణం తెలిపినట్లుగా అధివ్యాధికి కారణం తెలిసి చికిత్సచేయాలి. ధృతరాష్ట్రుని మనసులో ఏముందో విదురునికి తెలుసు. అందువల్లనే 'బలవంతుఁడు పైనెత్తిన బలహీనునికి నిద్రరాదంటున్నాడు, పాండవులు అజేయులని తన పుత్రులకంటె బలవంతులని వారివల్ల తన పుత్రులకు ముప్పుతప్పదని ధృతరాష్ట్రునికి తెలుసు. తర్వాత అంటాడు. భీముఁ దుంచినన్ మనము భీతిఁగలంగ చునుండు నాకు వేరేమియు నిద్రరాదు' అని. అస

నై న కారణం అదే. ఆ కారణానికి చికిత్స పాండవులను తగినరీతిగా ఆదరించి అర్ధభాగాన్ని పంచి ఇవ్వడం. రోగికి పథ్యాహారం లాగ దృతరాష్ట్రునికి ఈహిత వాక్కు రుచింపదు.

భారతం శాస్త్రకావ్యం. ఆనందోపదేశాలు రెండును అందులో ఆశింపదగినవే జాతిజీవనానికి పోషకాలైన ధర్మోపదేశాలు ఎన్నో ఉన్నాయి. వేదధర్మాలను కథాచ్ఛలం చేత భారతం విశదం చేస్తుంది. ఆనందం లేని జీవితం వ్యర్థమైనట్లు ఉపదేశ సంస్కృతంకాని జీవితం అనర్థదాయకం. భారతంలోని నీతులు జీవనపథంలో దారిదీపాలు.

ఒకరుని చేతిప్రోవును దదున్నతి ప్రాపును గాంచి యెల్ల వెం
టకును గొఱంతలేక పొగడఁదగు సంపదనొంది యట్టి దా
తకును దుఃఖగీడు సేసిన కృతఘ్నుని పీనుఁగునైన రోఁత పు
ట్టక కబళింపఁగుక్కలు నొడబడునే గురువంశవర్ధనా.

(ఉద్యోగ-2-77)

ఇది ధృతరాష్ట్రునికి విదురుడు చేసిన బోధనల్లో ఒకటి. కేవలసూక్తి మాత్రమేకాదు కథతో ముడిపడి ఉన్న ఉక్తి. ఒకరిచేత పోషింపబడి వారిచే ఉన్నతస్థానము పొంది. ఏవిషయంలో కొరతలేకుండా జీవిస్తూ అఖండ సంపదను ఆర్జించి చివరకు ఆ దాతకే కీడు చేసేవాని పీనుగును కబళించడానికి కుక్కలు కూడా ఇష్టపడవని ఈ పద్యంలోని తాత్పర్యం.

ధృతరాష్ట్రుడు రాజ్యపాలనలో పాండురాజు ఉపకారాన్ని పొందినవాడే. ఆతనిచే రాజ్య విస్తృతి చేయించినవాడే, దిగ్విజయయాత్ర చేయించి ఆతని భుజబలం వల్ల సంపదను సంపాదించినవాడే. కాని అన్నిటికి మారుగా ఆతని పుత్రులకు కీడు కలగడానికి కారణభూతుడైనాడు. ఉపకారానికి ప్రత్యుపకారం చేయటం ఉత్తమసంస్కారం. కురువంశవర్ధనుడైన ధృతరాష్ట్రుడే రాజ్యకాంక్షతో, పుత్రవ్యామోహంతో అధర్మపథంలో సాగిపోతున్నాడు. ఇక ఆతనికి అసలైన శత్రువు అంతరాత్మ !

వగ బలము తఱుఁగు రూపఱు
నగవిన మతిదప్పుఁబెవులు వచ్చును దూఱున్

వగచి నలంగిన (బి)యమగు(
బగతురకును వగచు టుడుగు పార్థివ ముఖ్యా

(ఉద్యోగ-2-79)

ధృతరాష్ట్రునికి మనః ప్రసన్నత కలిగించడానికి విదురుడు చెబుతున్న నీతుల్లో ఇది ఒకటి. వగ అనగా చింత. చింతవల్ల శక్తి తగ్గుతుంది. అందము నశిస్తుంది. బుద్ధిసన్నగిల్లుతుంది, రోగము వస్తుంది. సిందలకు లోనయినలిగిపోతే శత్రువులకు సంతోషం కలుగుతుంది కనుక చింతచేయరాదని తాత్పర్యము. చనిపోయాక దేహాన్ని అగ్ని దహిస్తుంది. చింత బ్రతికుండగానే మనిషిని దహిస్తుంది.

ఆలోచన మనస్సుకు ఆరోగ్యదాయకం, చింత అనారోగ్యప్రదం, కాని లోకులు ఆందోళనపడకుండా ఆలోచించలేరు. ఆలోచనకు, చింతకు అవినాభావ సంబంధం లేదు. ఆరాటం లేని ఆలోచన మనిషిని తేజస్విగా చేస్తుంది. ఇది ధృతరాష్ట్రుడు మిషగా భారతం లోకానికందించిన సందేశం.

అట మిన్నందిన యట్టివాని పొడవెంతన్నట్లు పాలాక్షు నె
క్కటి కయ్యంబునఁగన్న ఫల్గును భుజాగర్వంబు లెక్కించుటం
తటివానిం గొని ధర్మసూతి సమరోత్సాహంబుమై నెత్తి వ
చ్చుటకుం గొంకునె వీవుసక్కనయి నిల్చుంగాక మీ సైన్యముల్

(ఉద్యోగ-2-174)

సంజయరాయబారం ముగిసింది. విదురుని నీతిబోధ జరిగింది. కాని ధృతరాష్ట్రుని మనసులో మార్పురాలేదు. భీష్మద్రోణులు చెప్పేహితాన్ని కూడా ఆలకించేస్థితిలో లేడు. ఈసైన్యంబు తెల్లగూడి యునికి వినియెనే అని సంజయుణ్ణి అడుగుతాడు ఎవరిగొనియతండు కౌరవుల మీదయెత్తిరాగలుగువాడు అని ఆయన అనుమానం. ధృతరాష్ట్రుని మాటలు విని సంజయునికి మతిపోయింది. ఏయనను చెప్పినా అర్థం కాదనుకున్నాడు. మిన్నులు తాకె వాణ్ణి నీపొడవెంత అనిఅడిగినట్లు పరమశివుని అసహాయుడై ఎదిరించిన అర్జునుని భుజబలాన్ని భావించటం! అట్టి అర్జునుని వెంటబెట్టుకొని ధర్మరాజు ఉత్సాహంతో సమరానికి వస్తే మీసైన్యానికి ఏవు సక్కనవుతుంది' అని సంజయుని మాట.

సంజయుడు ధర్మరాజు పక్షంలో ఏయే వీరులున్నారో చెబుతూ మొదట భీముని పేర్కొంటాడు. తరువాత పై పద్యంలోని అర్జున ప్రసక్తి ఉంది. ధర్మరాజు అనే ధర్మతరువుకు కాండము, శాఖ వంటివారు అర్జునుడు, భీముడు అటువంటి వారటు వైపు ఉండగా వారి బలాన్ని గూర్చి ప్రశ్నించడం అవివేకం. జన్మాంధుడగు ధృతరాష్ట్రునికి వివేకచక్షువు కూడా లోపించింది. మాత్సర్యలోభాలచేత మసక కమ్మిన హృదయం గలవాడు ఉన్నస్థితిని ఊహించలేడు. కనుక సంజయుడు గుండెలు అవిసిపోయేలా ధర్మజుని బలప్రస్తావనగావించి అర్జునుడు కయ్యానికి వస్తేచాలు వీపుసక్కనయి నిల్చుంగాక మీసైన్యముల్ అంటాడు.

తెలుగు పలుకుబడికి గుడికట్టినవారిలో తిక్కన మొదటివాడు. సామెతలు ఆమెతలుగా గుమ్మరించే విద్య ఆయనకొచ్చింది. 'వీపుసక్కనయి నిల్చుంగాక అనే మాటతీరు నేటికీసజీవంగా ఉంది. సుడికారపు సోయగాన్ని తెలుపగలిగేవి ఇలాంటి సామెతలే. ఒక్కసారి సంస్కృత సమాసాలకు దీటైన తెలుగుపదాలు సృష్టిస్తాడు అజ్ఞానాంధకారం అనే దానికి అరయమి చీకటి అంటాడు దేశకాలాలు అనడానికి నేల ప్రొద్దు అంటారు. నడదీవియలు కన్నెకయ్యము వంటి పలుకుబళ్ళు ఆయనరచనలో పరిమళిస్తుంటాయి. 'నీతలపేనుగండి, వాడిసూదిమొన' వంటి ప్రయోగాలు ఆయన గంటవారికి కదనభూములు

ఏమీ పార్థుడు నీవు దండిమగలై యీవచ్చు కౌరవ్య సం
గ్రామ క్షోభము బాహుదర్పమునఁ దీర్పం చెద్ద మిట్టెక్కి మి
మ్మే మెల్లన్ వెఱఁగంది చూచెదము గాకీ సారికిం బోయిరా
భీముండిత్తఱి రిత్తమాటలకుఁగోపింపండు సూ వెంపఱన్

(ఉద్యోగ-3-85)

హాస్యరసికుడైన కృష్ణుడు భీమునితో మేలమాడిన సందర్భంలోనిది ఈ పద్యం. కౌరవుల వద్దకు సంధికోసం బయలుదేరబోతూ తన అభిప్రాయం తెలుపవలసిందని కృష్ణుడు భీముణ్ణే అడుగుతాడు. భీముడు శాంతంగా బంగారు పెంగ నేటికి సంధికే స్వాగతం అని పలికాడు. భీముని మూర్తికి రౌద్రం అలంకారం అయినట్లు శాంతం కాదనుకొని కాబోలు కృష్ణుడు వెటపెట్టిపియో యెక్కడు యెఱుంగని నీ యట్టివాని కెవ్వరొకో యీ పిఱికి తనమింత యలవడ గఱపినారు అంటూ కలకలనవ్వుతాడు. ఆ నవ్వు విషదగ్ధమైన బాణంలా భీముని గుండెను తొలిచేస్తుంది.

అప్పుడు భీముడు నీవు కవ్వడిమాత్రమే పౌరుషవంతులా! మీరు శత్రువులను జయించిరాగా మేము పెద్ద గుఱ్ఱెక్కి మిమ్ములను ఆశ్చర్యంగా చూడగలంతే! ఈసారికిపోయిరా! ఈ భీముడు చిట్టిమాటలకు కోపింపడు సుమా అని అధిక్షేపిస్తాడు అది చూచికృష్ణుడు 'ఊరక నీతో మేలమాడితిని అంతే అన్నాడు. నీవు మేలమాడి నందుకునేనును మేలమాడితినిలే అని భీముడు అన్నాడు. ఇందులో భీమసేనుని స్వాభిమానాన్ని పౌరుషాన్ని వ్యంజింపించడానికి తగినంత సామగ్రి ఉంది. అయితే ఈ సల్లాప రసం హాస్యంలో పర్యవసిస్తుంది.

కృష్ణుడు పరిహాస రసికుడు భీముడు స్వభావ వక్రతలేని అమాయకుడు అతని ఆవేశపూరితమైన వాక్కులో వాచ్యార్థానికేగాని, వ్యంగ్యార్థానికి అవకాశంలేదు.

ఈ వెంట్రుకలు పట్టి యీడ్చినచేయి
తొలుతగాఁబోరిలో దుస్ససేను
తనువింత లింతలు దునియలై చెదరి రూ
పఱియున్న యుడుకాఱుగాక
యలుపాలఁబొనుపకు నట్టి చిచ్చేయిది
వెన్నుగద పట్టిన భీమసేను
బాహుబలంబును బాటించి గాండీవ
మనునొక విల్లెప్పుడును వహించు
కవ్వడివిక్రమంబుఁగాల్పనే యిట్లు భి
న్నములు పడిన ధర్మనందనుండు
నేను రాజరాజు పినుంగుఁగన్నారఁ
గానఁబడయమైతిమేని కృష్ణ (ఉద్యోగ - 3 - 117)

తనకు జరిగిన పరాభవాన్ని, శత్రువులకు జరుగవలసిన ప్రతీకారాన్ని ప్రకటిస్తూ పాంచాలి పలికిన పలుకులివి. కృష్ణుడు రాయబారానికి వెళ్ళేసందర్భంలో ఆమె అభిప్రాయమేమో తెలుసుకోదలిచాడు. పతులు సంధికోరుతున్నా తన అభిప్రాయమేమో ఇందులో నిక్కచ్చిగా చెప్పింది. ద్రౌపది. ఆమె హక్కు క్రోధాభి వ్యంజనం, చేష్టాసముపేతం, క్రోధోచితాలైన వాగంగచేష్టలచేత ఉద్ధతులు రౌద్రప్రకృతులవుతారని భరతముని అన్నాడు.

ద్రౌపదికి ప్రధానంగా ఇద్దరిపై కోపం. అందులో మొదటివాడు దుశ్శాసనుడు సభలో తనను దలపట్టి ఈడ్చి వానిచేయి ముందుగా తునియలు కావాలి. అప్పుడు కాని ఆమె కోపతాపాలు చల్లారవు. అంతేకాని భీమసేనుడు ప్రతిజ్ఞ చేసినట్లు రొమ్ముపగిల్చి రక్తం త్రాగినంత మాత్రాన ఆమెకు తృప్తి లేదు. దుశ్శాసనుని తనువు 'ఇంతలింతలు' తునాతునకలు కావాలంటూ ఆమె అభినయించి చూపింది. అలాచేయలేకపోతే భీముని భుజబలం దండగ, అర్జునుని గాండీవం వ్యర్థం అని ఆమె అభిప్రాయం. భీముని 'పెనుగద' గాండీవ మనునొక విల్లు 'అంట్రా' ఆ పదాలను తేల్చి పలుకుతూ తనకు జరిగిన పరాభవానికి ప్రతీకారం చేయలేని ఆ ఆయుధాల పట్ల తన నిరసనభావాన్ని వ్యంజించింది. దుర్యోధన దుశ్శాసనులను చంపుతాననీ ప్రతిజ్ఞచేసిన భీముని, భీమసేనుడు' అని, సగౌరవంగా సంబోధించి ఏ ప్రతిజ్ఞాచేయని అర్జునుని 'కట్టి' అని సంబోధించి హృదయంలోని అసహనాన్ని సూచించింది. 'కట్టి' అనే పదం ఉచ్చారణంలో శ్రవణసుఖదం కాదు. పైగా శకటరేఫ ద్విత్వాన్ని ఉచ్చరించేటప్పుడు ముఖంలో క్రోధమూలకమైన ఒక వికృతి వ్యక్తమవుతుంది. సభలో తనను వివస్త్రగా చూడగోరిన వాని పీనుగును కన్నార చూడాలని ఆమె కోరుకోవడంలో క్రోధ తీవ్రదశ స్ఫురిస్తున్నది. వారి సింహాసనం తమపాలు, వారు శ్మశానం పాలు కావాలన్నది ఆమె అభిలాష.

ఒక్కొక్కకవి రౌద్రరస పోషణకోసం ఉగ్రసారం సమాస భూయిష్ఠ రచన చేయడంకన్నా అనేక పర్యాయాలు తెలుగు పలుకు కూడా జవజీవాలు కలవని నిరూపించడానికో అన్నట్లు ఇలాంటి రచనచేసి చూపిస్తాడు. మరోకవి అయితే సంస్కృత పదాల దృఢబంధాన్ని ఆశ్రయించి [illegible] ది కోపాన్ని వర్ణించి ఉండేవాడు అయినా ఇంతటి రససిద్ధిని సాధించేవాడు కాడే [illegible] !

రక్కసమూకలాడెవరు రాజును నమ్ము [illegible] వానిలోన నీ
వొక్కటియైన(గాదనక యూ(కొనుచుం [illegible] యంతకంటె మే
లెక్కట యిట్లువేడికొన నైనను బోయె [illegible] సుయోధనుం
డెక్కడ? భూమిలోన సగమిచ్చుట యె [illegible] డ? దానవాంతకా

(ఉద్యోగ-౩-౯౪)

అన్నగారి రాయబారపు సందేశం [illegible] పౌరుషహీనమై ఆత్మగౌరవానికి భంగపాటు కలిగించే శాంతభాషణాలు చేస్తూ [illegible] క్రోధంతో ఊగిపోతూ సహ

దేవుడు పలికిన ములుకులవంటి పలుకులివి రాజుగారు, ఆయన తమ్ములు పనికిమాలిన పలుకులు పలుకుతున్నారు. అందులో నీవు ఒక్క దాన్ని ఆక్షేపించకుండా ఊకొడుతున్నావు, అంతకంటె విపరీతం - నీవు కౌరవులను యాచించటానికి పోతున్నావు- సుయోధనుడేమిటి? సగభాగం రాజ్యాన్ని పంచి యీయట మేమిటి?

సహదేవుని దృష్టిలో ధర్మజభీమార్జునులని రక్కసమాటలు అనగా అయుక్తమైన పలుకులు రాక్షసప్రవృత్తికి సరిపడినవని. సంస్కార రహితమైనవని అర్థం అక్కట అనే అవ్యయం పాండవులకు జరిగిన అన్యాయమైన దైన్యాన్ని స్ఫురింపజేసి సహదేవుని క్రోధాన్ని వ్యంజిస్తున్నది. సహదేవుని ప్రకృతిలోని ఆవేశం అధర్మాన్ని సహించదు. నన్నయ్యకూడా సభాపర్వంలో శిశుపాలుడు శ్రీకృష్ణుని అర్ఘ్యం పొందడానికి అనర్హుడని దూషించే సందర్భంలో ఎడపక యర్ఘ్యమిచ్చుటను కిచ్చితి మిచ్చిన దీనికిం దొడఁబడని దుర్జనత్వమునఁబల్కెడు వీరుల మస్తకంబుపై నిడియెదను అని కాలు ఎత్తినట్లు స్వభావోచితమైన వర్ణన చేశాడు. నన్నయ్యది మితమైన తీవ్రమైన వర్ణన. మరి తిక్కనది సమగ్ర వ్యక్తిత్వబోధక చిత్రణ.

తృతీయ చతుర్థపాదాలలోని విషయం దుర్యోధనుని విషమస్వభావాన్ని ధ్వనింపజేస్తున్న విషమాకారం. ప్రాసలోని పరుషాక్షరం ద్విత్వమై ఊనిక పొందిన రెట్టింపైన సహదేవుని క్రోధాన్ని బయటపెడుతున్నది. చివర దానవాంతకా అని కృష్ణునికి వాడబడిన విశేషణం ఇది. అసురప్రవృత్తి గలిగిన వారిని నీవు సంహరించావు. మరి ఇప్పుడు దుర్మార్గులైన దుర్యోధనాదులతో సంధికి కార్యసాధకుడవైనావు. నీకొకధర్మం మాకొక ధర్మమా అని కృష్ణుని సహదేవుడు కచ్చితంగా ప్రశ్నించినట్లుంది. అతని కోపానికి ప్రీతుడై ప్రక్కనే ఉన్న సాత్యకి లెస్స అన్నాడట! ఆవేశం వారిద్దరికీ అవశిష్టమైన గుణం.

సహదేవుని క్రోధానికి మూలం శత్రుకృతాపరాధం. ఆ అపరాధ స్మరణంచే ఆతనిలో మనఃప్రజ్వలనం నాలుకలు చాచింది. అంత ఆవేశంలో కూడా ఆతడు తర్కబద్ధంగా సహేతుకంగా సోదరుల సంధి సంరంభాన్ని దూషించాడు. నేటి సమాజంలోని 'angry youngman' ఎలాంటి వాడో సహదేవుడలాంటివాడు.

సారపు ధర్మమున్ విమలసత్యముఁబాపముచేత బొంకుచేఁ
బారముఁబొందలేక చెడఁబాఱిన యైన యవస్థ దక్కులె

పాప్వరలుపేక్ష సేసినంత హరించేటంగాని ధర్మసస్త్రా
రకమయ్యు సత్యశుభదాయకమయ్యును దైవముండెడున్

(ఉద్యోగ-3-273)

కృష్ణుడు ధర్మోద్ధరణకు అవతరించిన మహాపురుషుడు లోకతత్వాన్ని, ధర్మతత్వాన్ని విడమరచి లోకానికి చాటిన లోకోద్ధారకుడు. ఆయనకు కావలసింది లోకకళ్యాణమే కాని సార్వభౌమత్వంకాదు. సాధుజనుల సముద్ధరణకు దురాచారుల వినాశనానికి ధర్మప్రతిష్ఠాపనకు అవతరించామని ధర్మప్రవక్తల విశ్వాసం

రాయబారానికి వెళ్ళిన కృష్ణుడు సంధికి ప్రయత్నించాడు పొందు పొసగకపోతే కలుగబోయే పరిణామాలను పూసగుచ్చినట్లు చెప్పాడు. పాండవుల ఉద్దేశమేదో ప్రస్ఫుటంగా తెలిపాడు. పాండవులకు దగినపాలు మేదిని బంచి యిచ్చుట కంటె గార్యము లేదన్నాడు.

ధర్మరాజు శాంతసుధాసింధు. కనుక ప్రతిరక్షణబుద్ధిగా సంధినే ఆశించాడు. సోదరుల చేత అదేమాట చెప్పించాడు. పాండవులందరు కౌరవసభలోని సభ్యులందరికీ పంపిన సందేశమే పై పద్యమందలి విషయం.

సారవంతమైన ధర్మం విమలమైన సత్యం పాపంచేతగాని అబద్ధంచేతగాని దరిజేరలేక వినష్టమైతే అది దానిని ఉద్ధరించడానికి చేతనై ఉండికూడా ఉపేక్షించినవారి దోషమవుతుందే తప్ప దైవము ధర్మమును దరిచేర్చుకోగలదు. శుభాన్ని కలిగింపగలదు అని వారి నిగమనం,

'ధరతి విశ్వంభరః'అని ధర్మానికి నిర్వచనం. ధర్మం విశ్వాన్ని భరిస్తుందని అర్థం. అటువంటి ధర్మాన్ని నిలుపడానికి దక్షులైవారు ప్రయత్నించాలి. కాని లోకుల ప్రవృత్తి ఇందుకు భిన్నంగా ఉంటుంది. కళ్ళముందు అధర్మం ప్రవర్తిల్లుతూ ఉంటే చూని ఊరకుంటారేగాని దాన్ని ఎదిరించే ధైర్యం ఉండదు. వ్యష్టిదృష్టికంటె సమష్టిదృష్టి గొప్పది. వ్యక్తిగతంగా నష్టంలేదని అధర్మాన్ని ఉపేక్షిస్తే అది సాంఘికమైన నష్టానికి దారితీస్తుంది. తమకు దుర్యోధనాదులు కావిస్తున్న అధర్మాన్ని కౌరవసభలోని సభాసదులు కూడా ప్రతిఘటించాలని పాండవుల విన్నపం. కౌరవసభలో ఈ అన్యాయాన్ని ప్రతిఘటించడానికి దక్షత కల్గినవారు గాంగేయ, ద్రోణ, కృపాచార్య, విదురులు. వారిని ఉద్దేశించియే ఈ ప్రస్తావన చేసి

నట్లు ధ్వనిస్తున్నది. మరివీరికంటే దక్షులెవరున్నారు. కౌరవసభలో. మానవ ప్రయత్నంకంటె, దైవబలం గొప్పదైనా మానుషశక్తి మహనీయమైన భావన ఇందులో సూచితమైంది.

> రాజులకెందు నారయఁ బరాక్రమ జీవన వృత్తి దక్కనొం
> డోజనిషిద్ధమండ్రు మునులుత్తమ సత్త్వులు వంశధర్మముల్
> పూజితభంగిఁ జెయుదురు బుద్ధివిహీనులు వానిఁదక్కి ని
> స్తేజపుఁ గూటి కియ్యకొని దీనతఁ బొందుదు రంబుజోదరా
>
> (ఉద్యోగ - 4 - 14)

కృష్ణుడు సంధికై చేసిన ప్రయత్నం ఫలించలేదు. పట్టుదలల ముందు సంధిప్రయత్నం వీగిపోయింది. కృష్ణుడు హస్తినాపురం నుంచి వెళ్ళిపోతూ ధర్మజాదులకు సందేశాన్ని ఇవ్వమని కుంతీదేవిని అడుగుతాడు. కుంతి శాంత చిత్తం కలవర పడింది అప్పుడు ఇలా అంటున్నది.

రాజులకు పరాక్రమ జీవనం తప్ప ఇంకొక ధర్మం నిషిద్ధమని మును లంటారు. ఉత్తమసత్త్వం కలిగినవారు వంశధర్మాన్ని సగౌరవంగా నిర్వహిస్తారు. మూఢులు వంశధర్మాని నిరాదరించి ఇతరుల చేతికూడును తింటూ దైన్యాన్ని పొందుతారు. మమతలకు మందిరమై మాతృచిత్తం సమయోచితంగా వీర పుత్రుల వెన్నుతట్టి కర్తవ్యాన్ని బోధించి, ధర్మపథాన్ని నిర్దేశించింది. కురు వంశధర్మాన్ని, క్షత్రియ ధర్మాన్ని తెలిసిన కుంతీదేవి పలికింది. ఈ అవసరాన్ని గుర్తింపలేక శత్రులకు రాజ్యభాగం దక్కడం లేదన్న ఉక్రోషంతో రణోన్ముఖులను చేస్తుందని అనుకోవటానికి వీల్లేదు. విద్యుక్తధర్మాన్ని మాత్రమే ఆమె ఉపదేశించింది. భారతం చాతుర్వర్ణ్యవిహిత ధర్మాలను ఎన్నోమార్లు ప్రపంచించింది. ఆనాడు అదే వారి సాంఘికన్యాయం. అందుకే ఋషులు రాజులకు పరాక్రమజీవనాన్ని విధించి అనుశాసించారు. గుణధర్మవిభాగాలను బట్టి క్షత్రియుడు పరిపాలనను తప్ప తక్కిన ధర్మాలకు పూనుకోరాదు. కనుక కుంతీదేవి ఇదే విషయాలను తన వాక్యాలుగా అనువదించుకొన్నది. ఉత్తమసత్త్వులు అనగా శ్రేష్ఠమైన సత్త్వగుణం కలవారు. రాజులు రాజసగుణంలో అహంకృతికే ప్రాధాన్యం కాని పరహిత రతికి ప్రాముఖ్యం లేదు. పాండవులు అలాంటి వారుగారు. సత్త్వగుణసంపదతో ఉద్యమించేవారు కనుక పాండవులు వంశధర్మాన్ని పవిత్రంగా నిర్వహించడానికి పూనుకోవాలని తేల్చిచెప్పింది అలాచేయకపోతే వారు

బుద్ధిహీనులనిపించుకొంటారని, పరులచేతికూడుతిని దైన్యాన్ని పొందవలసి ఉంటుందని, దానికి సుతరాం ఇష్టపడరాదని ఆమె క్షత్రియకాంతోచితంగా గర్జించింది. 'అంబుజోదరా' అని కృష్ణుని సంబోధించి అవతారపురుషుడవైన నీకు ఇది తెలియదా అని నర్మగర్భితంగా పలికింది సత్వము వీరగుణాసికింపనాది అన్నది గమనించాలి.

తిక్కన కవి రాజ్యాపాయశంకితచిత్త అయిన కుంతీ చిత్తంలోని క్రోధం వైక్లవ్యం ఈ పద్యంలో చిత్రించి చూపాడు. ఆమె ధృతిని బయటపెట్టాడు. పాత్రల మనోవృత్తులను బయటపెట్టి వారి స్వభావచిత్రణ చేసి వారి విస్పష్ట మూర్తులను మనకళ్ళ ముందు బొమ్మకట్టిస్తాడు తిక్కన మహాకవి

ధర్మతనయుండు తానునా తమ్ముఁడగుట
మెఱిఁగెనేనియు సామ్రాజ్యమేల పూను
నట్టి ధార్మికుఁడాధిపత్యంబుఁజేయ
వలవదే శాశ్వతంబుగ వసుధకెల్ల (ఉద్యోగ - 4 - 44)

యుద్ధం అనివార్యమని తేలిన తర్వాత కర్ణుని పాండవుల పక్షానికి ఆహ్వానించడానికి కృష్ణుడు చెప్పిన సమాధానం ఈ పద్యంలోని విషయం.

కర్ణుడు తాను కుంతీపుత్రుడనని ఎన్నడో కుంతి తనను కని నదిలో పారవిడిచిపోయిందని నొచ్చుకున్నాడు అది ఆయన మనసులో ఆరని చిచ్చు కన్నతల్లి కరుణించలేదు. సూతడు, అతని సతి వాత్సల్యంతో చేరదీసి ప్రయత్నశీలురై పెంచి మూత్రపురీషాదులు వాళ్ళ గాత్రంలో ఇంకేటట్లుగా లాలించి పాలించారు. జాతకర్మాది సంస్కారం నెరపిన రాధాసరధులే కర్ణుని దృష్టిలో ఆతని నిజమైన తలిదండ్రులు యౌవనంలో తన విద్యను గౌరవించి సభలో సంభావించి రాజుగా దీవించి, జీవించడానికి సమస్తసదుపాయాలు కల్పించిన వాడు సుయోధనుడు వీరందరినీ వదలి ఎన్నడో కని విసరివేసిన కుంతికి, స్పర్ధతో ఎదురునిలిచిన పాండవుల పక్షానికి కర్ణుడు చేరడం అసంభావ్యం కన్నప్రేమ కంటె సాకినప్రేమ గొప్పదంటారు దానికిదే లక్ష్యభూతం.

అయితే కర్ణునిలో బుద్ధి, హృదయం రెండూ పనిచేస్తున్నాయి. నిశ్చయాత్మకమైన బుద్ధి సూతుని సుయోధనుని విడచి వెళ్ళవద్దంటున్నది. మమకారంతో ఆర్ద్రమైన హృదయం తల్లిపై తమ్ములపై క్షమచూపిస్తున్నది. చిన్ననాట నుండి

అవమాన భారానికి లోనయి ప్రసంగించిన హృదయంలో అభిమానభావం నిలువెత్తుగా నిలిచింది. కనుక తన భావాన్ని స్పష్టంగా చెప్పాడు. ధర్మాధర్మ వివేకం అతనికి ఉంది. ఎవరు ఏమిటో అతనికి తెలుసు. యధార్థమేమిటో, జరుగుతున్నదేమిటో, జరుగబోయేదేమిటో తెలిసి కురుక్షేత్రంబున మముబోంట్లను సద్గతి వడయుదురు గాక అని దీనికి మూలము నేను శకునియు దుశ్శాసనుడు అని కృష్ణునితో అన్నాడు ఆక్రాంత దృష్టితో అన్నమాటలే పై పద్యంలోని విషయం సద్గతి అన్న శబ్దం ధ్వని పూర్ణంగా ప్రయోగించాడు తిక్కన కవి.

ధర్మతనయుడు నాతమ్ముడని తెలిస్తే తాను సామ్రాజ్యం పూనడు కాని అలాంటివాళ్ళే పరిపాలించాలి అట్టి ధార్మికులే శాశ్వతంగా వసుధను శాసించాలి. అని కర్ణుని అభిప్రాయం, కర్ణుడు విషాదాంత నాయకుడు గుణసంపూర్ణులైనా అతర్కితంగా సంభవించిన ఆపదలకు గురియై, తెలియక చేసిన తప్పిదానికి బలియై, శిలయై పోయాడు. కర్ణుని తల భారతమంటారు. కాని కర్ణుని తలలో ఉన్న ఈ గండర గోళాన్ని గమనించే వారెవరు! నిష్కారణంగా శాపగ్రస్తులై సర్వశక్తులను పోగొట్టుకొన్న కర్ణునిపై లోకం అభిమానం ప్రదర్శిస్తున్నది. దానకర్ణుడని దండోరా వేస్తున్నది.

> భూరివిభూతిఁబెండ్లికిని బోవుతెఱంగునఁ బాండునందనుల్
> తారును బుత్రులున్ హరియుఁదమ్ముఁడు నుజ్జ్వలచారులీల శృం
> గారముచేసి సమ్మదవికాస మెలర్పఁగ వీరసంభ్రమో
> దారసముద్ధతిం జనిరి ద్రౌపది యున్నెడ కుందలున్ దగన్
>
> (ఉద్యోగ-4-118)

పాండవులు ప్రస్థానభేరి మ్రోగించారు. ఆ భూరినిష్ఠుర ఘోరభాంకారానికి ధాత్రి కుమ్మరిసారెలాగా దిర్దిర దిరిగిందట! మరునాడు యుద్ధసన్నద్ధులై అలంకృతులై అందరూ ద్రౌపది వద్దకువెళ్లారు. ఆవెళ్ళిన తీరును ఈ విధంగా వర్ణించాడు తిక్కనకవి.

వారికి యుద్ధానికి వెళ్ళినట్లుగా లేదు పెళ్ళికి ప్రయాణమైనట్లున్నది పాండు నందనులు వారిపుత్రులు, శ్రీకృష్ణుడు అతని తమ్ముడు సాత్యకి, ఉజ్వలంగా అందంగా సింగారించుకొని ఆనందముప్పొంగగా రీవిగా ద్రౌపది వద్దకు బయలు దేరారు.

ఉత్సాహము ఉత్తమప్రకృతులకు సంబంధించింది. ఆ ఉత్సాహంవల్ల లోకోత్తర కార్యసాధనకు పూనుకొంటారు. ఉత్తములు. ఆ ఉత్సాహానుభావాలే వర్చసుగా ముఖంలో ప్రకాశిస్తుంటాయి. ఆహవానికి పోతున్నవారిని చూస్తే వివాహానికి పోతున్న వారిలాగా కన్పించటానికి కారణం ఆభరణధారణం, ఉత్సాహసంభరితాంతరంగం ఉజ్జ్వలచారులీల శృంగార శబ్దాల చేత దాన్ని విశదంచేశాడు తిక్కన కవి. ఉజ్వలచారులీల అనగా ప్రకాశిస్తున్న అందమైన చేష్ట శృంగారమనగా సింగారం, సమ్మదము అంటే సంతోషం వీరత్వం త్వర ఉదారత ఈవి వారి గమనంలో గోచరిస్తున్నది.

వీరునికి రణరంగం స్వర్గాంగణం వంటిది, మరణిస్తే స్వర్గ సుఖాలను రుచిచూస్తాడు. విజయం వరిస్తే మురిసిపోతాడు ఎలా వీరుడు ప్రవర్తించాలో ఉపదేశిస్తుంది పద్యం. పాండుకుమారులు ద్రౌపదివద్దకు పెండ్లికి వెళ్ళినట్లు వెళ్లారనటంలో స్వారస్యం తొంగిచూస్తున్నది. యుద్ధమంటే జంకవలసిన సతి తానే పతులకు ప్రోత్సాహమిచ్చి ప్రబోధితులను చేసింది. ద్రౌపదిని ఆమంత్రణం (వీడుకోలు) చేసి మంగళాశీర్వాదాలు పొంది రణరంగానికి ప్రయాణమైనారు. ఆ వీరులు.

పాండవసతిని వీడ్కొన్నవారికి పరౌకరి ప్రసన్న వదనం ఆశీస్సు పలికినట్లుగా ఉంది. ఆయనే కురువంశానికి మూలపురుషుడు చంద్రుడు.

మనుమని జయప్రయాణం
బనుమోదింపగ నాసుధాంశుఁడు సనుదెం
చిన కరణి గొడుగు కుంతీ
తనయాగ్రజుల నతిసిత ప్రభ నొప్పెన్ (ఉద్యోగ-4-121)

ధర్మరాజు ముందటి గొడుగు చంద్రునిలాతోచి తన మనుమడు సమరానికి వెళుతున్నాడు ఆశీర్వదిద్దామని వచ్చినట్టుగా ఉందట. గొడుగు చంద్రునిలా కనిపించటం సాదృశ్యసామగ్రివల్ల. దానినే తిక్కన ఉత్ప్రేక్షించాడు. సామాన్యనిరీక్షణం సంస్కారవంతులిది ప్రేక్షణం కవిది ఉత్ప్రేక్షణం

ముదుకఁడ నైన నామబలముం జలమున్ వివిధాస్త్రశస్త్రసం
పదయును బోయి నీ గురుఁడు భార్గవుచే విను మాజిభూమి నా
కెదిరినవారు పెక్కండలనేమయిరో యెఱుఁగుదు జగంబు నా
ముదిమియు నీకుమార్గణనమున్ వరుసన్ విజయుం జెఱింగెడున్
(ఉద్యోగ-4-246)

కర్ణుని పలుకులకు రోషపడి భీష్ముడన్న మాటలివి. దుర్యోధనుడు తన సైన్యంలో ఎవరెవరే పాటివారో తెలుపవలసిందని భీష్మాచార్యుని అడుగుతాడు. తాను ఉన్నది ఉన్నట్లుగా చెబుతానని 'నీవతి రథుడవు' 'రాధాసుతుండు అర్ధరథుడు' అంటాడు. భీష్ముడు అదివిని కర్ణుడు మండిపడతాడు అర్ధరథుడంటివినును ఏమి తక్కువగలదు చెప్పుమని నిలదీసి అడుగుతాడు ముదిమతి తప్పినోరికి నాదవినట్లు వదరుతున్నాడని భీష్ముని ఆక్షేపిస్తాడు. దానికి సమాధానమిస్తూ భీష్ముడన్న పలుకులివి :

నేను ముసలివాడనే! కాని నాబలం అస్త్రశస్త్రాల సంపదను గూర్చి నీ గురువైన పరశురాముణ్ణి అడిగితే చెప్తాడు రణరంగంలో ఎన్నోమార్లు నన్నెదిరించినవారు ఏమైనారో లోకానికి తెలుసు నీవెంత యువకుడివో, నేనెంత ముసలో త్వరలోనే విజయుడు చెబుతాడు.

కర్ణుని అర్ధరథుడని భీష్ముడెందుకన్నాడు మాత్సర్యం చేతనా లేక ముదిమతి తప్పిఅన్నాడా అలాకాక కౌరవుల వ్యూహాన్ని కలవరపరచి పాండవులకు ప్రయోజనం కలిగించడానికి అన్నాడా అనేది విచారింపవలసిన విషయం ఉప్పు తిన్నవారి ఉసురుతీసే మనస్తత్వం కాదు భీష్మునిది.

భీష్ముడు శరతల్పగతుడైనపుడు కర్ణుడు ఆయన వద్దకు వెళ్ళుతాడు. అతన్ని చూచి పాండుతనయుండ వగుటఁజేసి నీయెడ వాత్సల్యంబుకాని మాత్సర్యంబు లేదని ఆప్యాయతతో పలుకరిస్తాడు. సుయోధనునకు నెప్డు నీదు భుజదర్పము కాదె సహాయమెద్ది యాతనికి, ప్రియము దానిన యుదాత్తమతిం దగనాచరింపుము అని సంతోషంగాసూచిస్తాడు. నిజంగా భీష్ముడు కర్ణునితో అలా వ్యవహరించి అర్ధరథుడని పలుకకపోతే అతిరథుడైన అతడు మొదటినాడే రణభూమికి వచ్చి ముందుగానే మోహరంలో మృతుడై ఉండేవాడు. ఆ పిమ్మట కౌరవసైన్యానికి కావలసిన నాయకత్వం వహించడానికి కర్ణుడొకరైఉండేవాడు. అంతదూరం ఆలోచించి భీష్ముడు కర్ణుని తన మరణం వరకు రణభూమికి దూరంగా ఉంచాడు. ఉత్తముల ఆశయాలు కార్యరూపంలో కాని కనిపించవని విజ్ఞులంటారు. అంతటిది భీష్ముని దూరాలోచన.

మేధావియైన తిక్కన కవి సంభాషణ రచనలలో వ్యావహారికం భాషలోని కాకువును ననుసరించి చక్కని భావస్ఫురణ కల్పిస్తాడు. అది ఉచ్చారణలో స్పష్టంగా వ్యక్తమవుతుంది. ఈ పద్యం అందుకు ఉదాహరణం.

"ఆశనీ కల్పములివి యర్జును బాణముల్
గాని శిఖండివిగావు ముమ్మ
కర్కాట గర్భంబు కరణి గాత్రము వ్రచ్చె
నిట్టివి వీనికి నెందుగలవు....…."                    (భీష్మ-3-405)

భీష్మాచార్యుణ్ణి చంపటానికి అర్జునుడు శిఖండిని అడ్డంగా పెట్టుకొని పోరాటం సాగిస్తున్నాడు శిఖండి నిలిస్తే ఆచార్యుడు యుద్ధం చేయడు పేడివానితో యుద్ధం చేయటానికి ఆయన మనసొప్పదు కాని శిఖండి చాటునుండి శరాలు వర్షిస్తున్నది. సవ్యసాచి అని భీష్ముడు గుర్తింపకపోలేదు. ఆ బాణధాటికి నొచ్చుకొని భీష్ముడు ఇలా అన్నాడు.

ఈ బాణపాతం పిడుగులు కురిసినట్లుగా ఉంది. ఇవి అర్జునుడు వేస్తున్న బాణాలేకాని శిఖండిని కావు ఎండ్రిగర్భంలాగా శరీరాన్ని బాధిస్తున్నవి. శిఖండికి ఇలాంటి శరాలు లేవుగదా!

ఆశనికల్పములనడంలో అర్థమున్నది ఇంద్రుని వరబలం కలిగిన అర్జునుని బాణాలు నిజంగా ఆశని కల్పములే. కర్కాటక గర్భంబు కరణి అనడంలో ఒక విశిష్టార్థముంది ఇక్కడ భీష్ముని పరిస్థితి ఎండ్రి గర్భంలా ఉంది. ఎండ్రి సంతానం ఉదరం చీల్చుకొని బయట పడుతుంది. ఎండ్రి ప్రసవవేదనలో ఉన్నది. మరణవేదన అలాంటప్పుడు ఎండ్రి తనకు సంతానం కలుగుతున్నదని సంతోషించాలా! లేక సంతానంతో పాటు తన మరణం తప్పదని దుఃఖించాలా! అది ఒక మధురవేదన అర్జునునివంటి వీర పురుషునికి పైగా తనకు ఇష్టులైవానికి మనుమనికి తన మరణంతో విజయావకాశం కలుగుతుందని భీష్ముడు ఆనందపడాలా! లేక అతని శరపీడకు తాళలేక శరీరబాధతో వెతచెందాలా! అందుకే ఆయన ఒక విచిత్రానుభవానికి లోనైనాడు ఉపమానానికి ఎంతటి భావస్ఫోరక శక్తి ఉందో తిక్కనగారిక్కడ నిరూపించారు. వ్యాసర్షి రచనలోనే ఉన్న ఈ ఉపమానం తిక్కనకవి రచనలో కుదురుకొని ఆయన గాఢ భావనాశక్తిని పరిఢవిల్ల జేస్తున్నది,

ఇలాంటి ఉపమను తిక్కన విరాటపర్వంలో కూడా పోరాటం జరిగింది. తనను ఆశ్రయించటానికి వచ్చిన ద్రౌపది సౌందర్యాన్ని చూచి సుదేష్ణ ఆశ్చర్యపడి తన భర్త ఆమె సౌందర్యం కోసం ఉవ్విళ్ళూరుతాడేమో అని అనుమానించి

ద్రౌపదిలో దుర్భరయగు నిన్ను గర్కటగర్భంబు ధరియించినట్లు గైకొని నాకై నిర్భర విధ్వంస దశా నిర్వాపం దెచ్చుకొనుట వెరవై ఉన్నే అని సంకోచాన్ని ప్రకటించింది. స్త్రీ సహజమైన శంకతో స్వయంగా వినాశనాన్ని ఆహ్వానించడం ఇష్టంలేక ఆమె కొట్టుమిట్టాడింది. ఒకే ఉపమను సందర్భోచితంగా వారి వివిధ భావాలను స్ఫురింపజేయడం తిక్కన ప్రతిభాశక్తికి నిదర్శనం

కరికళేబరములు ధరణీధరములు దు
    రంగ గాత్రమ్ములు గ్రాహసమితి
నరశరీరములు మీనములు గౌక్షేయక
    క్షురికాది శస్త్రంబు లురగనిలము
రుధిరార్ద్ర శరములు రుచిరప్రవాళముల్
    ప్రేవుల ప్రోవులు ఫేనతతులు
నెత్తురు వెల్లువ నీరులు భూషణ
    స్తోమాస్థిచయముల తుమురు లిసుక
గాంగనంబు రాశికరణి సంగ్రామ భూ
భాగమొప్ప మిగుల భవయోగ
నిద్రనున్న విష్ణునికి జోడయగుచు శో
భిల్లె నమ్మురారి యల్లుడందు (ద్రోణ-2-128)

అభిమన్యుడు మరణించాడు దివంగతుడైనాడు - కాదు స్వర్గధామంచేరి నాడు - అదీగాదు విష్ణుత్వాన్ని పొందినాడంటున్నాడు తిక్కన మహాకవి. సంగ్రామ భూమిలో మృతుడై పడిఉన్న అభిమన్యుడు సముద్రంలో యోగనిద్రలో ఉన్న విష్ణుమూర్తిలాగా ఉన్నాడట! మురారి అల్లునికి ఆ ఉపమానం ముచ్చటగా ఉంది.

ఏనుగు శవాలు, పర్వతాల్లా గుర్రాల శరీరాలు, మొసళ్ళలాగా నర శరీరాలు చేపలుగా ఖడ్గాలు చురికలు పాములుగా రక్తసిక్తాలైన బాణాలు పగడాలుగా ప్రేవుల గుట్టలు నురగగా, నెత్తురునీరుగా, నగలు ఎముకల తుమురు ఇసకగా సంగ్రామ సీమ సముద్రంలాగా ఉంది అని తిక్కన మహాకవి భావించాడు.

ఈ దృశ్యాన్ని కన్నులకు కట్టినట్లుగా వర్ణించాడు జుగుప్సాకరమైన సన్ని వేశం ఆనందదాయకంగా ఉండటం ఒక్క కవిత్వంలోనే సాధ్యం. భారతంలోని కథావస్తువు - ముఖ్యంగా అందులోని యుద్ధషట్కం - రణరంగవర్ణనకు సంబం

ధించినది వీరులు యుద్ధోత్సాహంతో పోరాడి రౌద్రోద్రేకములవల్ల శత్రువుల కంఠ విలుంఠనల కావించి హతుల అవయవాలచేత యుద్ధరంగాన్ని వికీర్ణం చేస్తారు. అటువంటి సందర్భాల్లో తిక్కనకవి జుగప్సాభావానికి రమణీయోపమను జోడించి భయంకర రమణీయమై ఉంది అంటాడు. ఈ మాట ఆయనకు చాలా ఇష్టం నిజా నికి వర్ణితమైనవస్తువు రోతపుట్టించేదికావచ్చు కాని అది లౌకికపురుషుల వీరరసానికి ఫలితం. వస్తువు స్వభావలోని కటుత్వాన్ని పౌరుష్యాన్ని,ఔపమ్యంతో తొలగించటం తిక్కనకవికి అలవాటు

అభిమన్యుడు బాలుడైనా ఎంతటి యోధుడో అందరికీ తెలుసు, అలాంటి వీరుని మరణాన్ని అభిమానంతో వర్ణించి, ఆతని శాశ్వతనిద్రను యోగనిద్రగా సంభావించి, ఆ సంఘటనపట్ల గల తన ఉదాత్తభావాన్ని తరళింపజేశాడు తికయజ్వ ఇక్కడ ఉపమేయాన్ని ఊహిస్తే చిత్తం కరుణరసార్ద్రమవుతుంది. ఉపమానాన్ని తలచుకొంటే కైవల్య ప్రాప్తి కళ్ళకు కనిపిస్తుంది. ఉపమేయం ఉపమానంగా 'శోభిల్లి' అంటున్నాడు కవి శోభిల్లినది తూగని తీవంటి శాశ్వతనిద్రలో ఉన్న అభిమన్యుని ముఖమండలం అయత్నజమై వికాసము కలిగించే ఆవీరుని ముఖవర్చస్సు మరణ సమయంలోనుతొలగిపోలేదన్నది లోకంలో అనుభవంలో విరుద్ధంకాదు.

ఏనురము ప్రచ్చి నెత్తురు
దేనియ యిదె త్రావెదం గగిసినను గడిమిన్
మానుప దిక్కు గలిగినన్
రానిమ్మెలుగింపు మీ మొనగల వారిన్ (కర్ణ-3-21౬)

తన సతికి చేసిన అవమానానికి ప్రతీకారం తీర్చుడానికి సిద్ధమై ఆనాడు తాను చేసిన ప్రతిజ్ఞ చెల్లించటానికి దుశ్శాసనునిబట్టి, చుట్టూత్రిప్పి నేలకేసికొట్టి కాలితోత్రోసి, మెడను త్రొక్కిపట్టి నానావిధాలుగా నలిపివేసి భీముడిలా అంటున్నాడు.

'నేను నీ రొమ్ము చీల్చి నెత్తురు తేనె త్రావుతున్నాను. నా వద్దకు వచ్చి ఈ క్రియను ఆపగలిగిన దిక్కెవరైనా మీ సేనలో ఉంటే పిలుచుకో

'ప్రచ్చి'అనే పదమే రౌద్ర కర్మోచితమైన క్రియా సూచకం నెత్తురు తేనియ అనే రూపకం భీమసేనుని క్రోధాన్ని వ్యంజిస్తూ రౌద్రతత్పరతను సూచిస్తున్నది. దిక్కుగలిగిన అన్న నుడికారం రచనలోని ఒక సోయగం.

తరువాత భీముండంటున్నాడు! తల్లిపాలు త్రాగాను, పలురకాల తేనెలు ఆస్వాదించాను, ఖండశర్కరతోడిపాలు రుచిచూచాను. అవియేవి నాకింత రుచిగా లేవు? అని ఆ పద్యం చూడండి.

తల్లి చన్నుల పాలేను త్రావనెట్టు
లాననే పలు తెఱగుల తేనియలను
ఖండ శర్కరతోడి దుగ్ధంబు లనుభ
వింపబడవే! యవియు నింత ఇంపుగావు.

భీముడు ధీరోదాత్తుడు పూర్తిగా ఆయన రౌద్రకర్ముడుకాడు. కర్మలో రుద్రుడు అతనిది శత్రుకృతాపరాధజన్యమైన ప్రచండ చిత్తవృత్తి అది క్షత్రియులకు ఉచితమే లోకంలో భీముడు ఉత్తమ పురుషుడుగానే తలపబడు తున్నాడు అతని ఆవేశ సాగరానికి ధర్మరాజైనా, ధర్మమైనా చెలియలి కట్ట!

పై రెండుపద్యాలు రౌద్రాన్ని కళ్ళకు కట్టిస్తున్నా రచనలో ప్రౌఢత్వం భాసించటంలేదు ఇది తిక్కన వంటి కవులు కొందరికే తెలిసిన విద్య "అనుభవింపఁబడవే" "కానఁబడమైతిమేని" వంటి ప్రయోగాలు సంస్కృత భాషామర్యాదను సరించి తెలుగులో పుట్టినవే ఇటువంటి కర్మణి ప్రయోగాలు ఉద్దిష్టార్థాన్ని నిర్దిష్టంగా చెప్పడానికి సహజంగా సద్యోజాతాలైనవి. భాషలో ఇలాంటివి పుష్టిగల పదపల్లవాలే గాని దిష్టిబొమ్మలుకావు. నేడు మనం వాడుతున్న కర్మణిప్రయోగాలు చాలా వరకు సాహిత్య భాషకు గాయాలే

ఓం ధాత్రీ సురాధమ! క్రూరకర్మ!
కపట ధార్మిక! యత్యంత కల్మషాభి
యుక్తిఁబోయినరేయి మహోగ్రవృత్తిఁ
దగిలి తెంతవె గిరమునఁదపసివైతి (సౌప్తిక-2-69)

అశ్వత్థామ మహాక్రూరుడు. గురుపుత్రుడై ఉండి కురువంశం పరువు నిలుపవలసినవాడు అణచరాని క్రోధముతో అనుచితమైన మారణకర్మతో, బీభత్సాన్ని సృష్టించాడు తండ్రిని చంపినారన్న కసితో వాస్తవంగ మన్నించలేక సుయోధనుని కిచ్చిన మాటకోసం, ఒకనాటి అర్ధరాత్రి పాండవ శిబిరంచేరి నిద్రతో ఉన్న వీరులను, వరుసపెట్టినరికి వేసినాడు ధాత్రీసురుడైనవాడు. దయచూపాలి గాని తలలు నరకుట ఆయనకే చెల్లినది. ఆయన రౌద్రకర్మ శ్రవణమాత్రానానే మనకు గగుర్పాటు కలిగిస్తుంది. లోకంలో ఎందరో క్రూరకర్ములున్నారు. కాని వారందరికి ఆది గురువు అనిపించుకో దగినవాడు అశ్వత్థామ దృష్టద్యుమ్నుని చంపి, ఉత్తమాజుని, యుధామన్యుని సంహరించి, శిఖండిని ఖండించి పాంచాలురను పంచత్వమొందజేసి కరితురగాలను కకావికలు పాండవపక్షం వారి శిబిరాలలో చిత్రవధ సాగించి కొన ప్రాణంలో ఉన్న సుయోధనునికి ఆ మారణకాండ తెలిపి సంతోషపరచి క్రోధం పొరలు తొలగిపోగా భయపడి వ్యాసమహర్షి పక్కన కూర్చొని దిక్కు-బిక్కు-మని దిక్కులు చూస్తూ బూడిద రాసుకొని కపట జపం చేస్తుంటాడు. భీముడు అతని వెంటబడి తరుముతూ అన్న మాటలే ఇవి.

"ఓరీ బ్రాహ్మణాధమా! క్రూరకర్ముడా! దొంగ సన్యాసి! మిక్కిలి కలుషచిత్తంతో పోయినరాత్రి మారణకాండ ఎంత తొందరగా సన్యాసివైతివిరా! అంటూ భీముడు అశ్వత్థామ వెంటబడ్డాడు లే లెమ్ము తపమ్ము చాలు రణమ్మునకు రమ్మ అని భీముడు అశ్వత్థామను గద్దించాడు.

లోకంలో కొందరు హింసతోనే రమిస్తారు. అలాంటివాడే అశ్వత్థామ కూడ అయితే ఒక్కొక్కసారి ధర్మంవైపు నిలబడతాడు, ఒక్కొక్కప్పుడు శ్రీకృష్ణుని

వంటి వానిని తనతో యుద్ధం చేయమని ఆహ్వానిసాడు. అర్జునుడు బ్రహ్మాస్త్రాన్ని పొందినాడన్న అసూయతో తండ్రిని మభ్యపెట్టి అదే అస్త్రాన్ని తానూ సంపాదించాడు పరిణామాలు ఊహించకుండా. నారాయణాస్త్రాన్ని పాండవబలం మీద ప్రయోగించాడు అర్జునుపై ఆగ్నేయాస్త్రం ప్రయోగించాడు క్రోధి చేతిలో ఉన్న అస్త్రం కీడు కలిగిస్తుంది. అశ్వత్థామ వల్ల అదే జరిగింది అయినా చివరకు అవమాన భారంతో క్రుంగిపోయి శిరోమణిని పాండవులకివ్వక తప్పలేదు.

విరాటోద్యోగ పర్వాల తర్వాత తిక్కన రచనలో మార్పు వచ్చింది. ఆయన శైలి ఆర్ద్రగుణసంకలితమైంది. ధరించిన ఆభరణాలు వదిలివేసి భావనా మాధుర్యాన్ని పెంపొందించుకొని నీరవస్వరధారతో తేజస్విగా వెలుగుతున్నది, తిక్కన మహాకవి శైలీశైలూషి ఎంత విస్పష్టమైన రచనగా పైపద్యంలో కనిపిస్తుందో సహృదయులకు అనుభవంలోనిదే నిఘంటువుల జోలికిపోకుండా సామాన్యులు సైతం అర్థంచేసుకోగల పద్యాలు ఇవి. రాను రాను రచన మరీ ప్రసన్నంగా మారింది.

> ఈతఁడు రణంబునకు నెత్తిచనుచుండి నను
> నెంతయును భక్తిఁగని నాకుం
> బ్రీతి యెసఁగంబలికిఁ బ్రేమ మొలయుం బాగడి
> పెద్దయు వినీతిరతుండై
> చేతులుమొగిల్చి జయసిద్ధియుగ దీవన వి
> శిష్టదయ నిమ్మనిన ధర్మం
> బే తలన నూనమగు నిద్ధజయమాతలకు
> నెట్టియిన సిద్ధమగునంటిన్ (స్త్రీ-2-28)

రణభూమిలో దుర్యోధనుని కళేబరం చూచి గాంధారి కుప్పగా కూలిపోయింది. కుమారుని శరీరానికి పట్టిన స్థితి తలచుకొని తల్లడిల్లిపోయింది. ప్రక్కనున్న శ్రీకృష్ణునితో ఇలా అంటున్నది.

సుయోధనుడు రణానికి పోతూ సన్మానంతో భక్తితో సేవించి, ప్రియంగా మాట్లాడి స్తుతించి, ఎంతో వినయంగా చేతులు జోడించి జయం కలగాలని దీవించమని అడుగగా ఏవైపు ధర్మం ఉన్నదో ఆ పక్షానికే జయం కలుగుతుందని దీవించాను.

మాతృప్రేమ ఎంతటి తప్పిదాన్నైనా మన్నిస్తుంది. సుయోధనుని అకార్యాలు ఆమెకు తెలుసును వాటి పర్యవసానం ఎలా ఉంటుందో కూడా ఆమెకు ఎరుకలోనిదే వాత్సల్యంతో కుమారునికి జయం కలుగుగాక అని దీవించవలసిన ఆమె, ధర్మం ఏ పక్షంలో ఉందో ఆపక్షం గెలుస్తుందని ఆశీర్వదించింది. 'కొడుకంచు ప్రియోక్తులు పల్కిన పెంపెసెడున్' అని ఆమె ఉద్దేశం.

స్త్రీ పర్వం కరుణరసకలితం అందులో ఛందోవైవిధ్యం చూపి కరుణ రసానుగుణంగా పద్యాలను చేస్తున్నాడా తిక్కనమహాకవి అని తోస్తుంది పై

పద్యంలో ఎంతటిగానగుణముందో పఠనంతో నే ప్రస్ఫుటమవుతుంది. అది గాంధారి పరిదేవనంలోని రోదనంలాగా అనురణన శక్తివల్ల స్ఫురిస్తుంది.

గాంధారిలో గాంభీర్యం ఎక్కువ ఆమె ఎన్నడు కుమారుని చేతలను సమర్థించలేదు. పైగా ఆ చావుచావఁదగు నన్నిచునకున్ అనుకొన్న ఆమెలో ఏదోషం చూపజాలం? నూరుగురు కుమారులు పోలికలు బలియైపోతే దిక్కుతోచక విలపించింది. దుఃఖావేశపరవశయై కృష్ణుని తపించినా వాస్తవం ఆమె ఎరుగక పోలేదు.

ఈ పద్యంలోని రచనాకళ మాధుర్యగుణబంధురంగా ఉంది. కరుణరస పోషణలో పృథక్పదత్వమే గాని గాఢబంధం పనికిరాదు రనుటాను కవిబ్రహ్మ రచన ప్రసన్నతాగుణాన్ని సంతరించుకొంది, అప్రతిమాన పాండిత్య శేముషీధురీణుడైనా ఇంతటి తేటదనం కల్గిఉండటం ఈ మహాకవి రచనలోని రమణీయ రహస్యం.

> ధనమది యేల భోగమును దానము లేదగునేని శత్రుమ
> ర్దన మొనరింపఁడేని బలదర్పములేం? సధర్మవృత్తికిన్
> గొన కొనఁడేని విన్కి మునికుంజర యేల, జితేంద్రియుండు గాఁ
> డనఁ జనునేని నాత్మవిదమారయు నాక్రమమేల చెప్పుమా!

(శాంతి-6)

మహాభారత సంహితారచన వేదవ్యాసుడు తన కుమారుడైన శుకునికి ఉపదేశించిన జ్ఞానమిది వ్యాసుడులోకజ్ఞుడు శుకుడు జ్ఞాని పుత్రాదిచ్ఛేత్ పరాజయం అని వ్యాసుడు శుకుని చూచి సంతోషింపగలడు. యోగ్యుడైతే పుత్రుని చూచి సంతోషించడం కన్నాతండ్రులకు పరమానందం ఏముంది? మరి శుకుడైతే జనకునికే ఉపదేశించగలిగిన మహాజ్ఞాని పై బోధకు అర్థమిది :

అనుభవించడానికి దానంచేయడానికి వినియోగించని ధనం ఎందుకు? శత్రువును ఓడించలేని బలపరాక్రమాలు ఎందుకు? తన ధర్మాన్ని సక్రమంగా నెరవేర్చడానికి ఉపయోగించుకొనని శ్రుతిజ్ఞానం ఎందుకు నిగ్రహం లేకుండా ఆత్మజ్ఞానం సంపాదించే ప్రయత్నం ఎందుకు?

లోకంలో మూలకారణం గ్రహించలేక సమస్యలను పరిష్కరించుకోలేని విషమపరిస్థితి ఉంది. ఏ గుణాలకు ఏ ప్రయోజనం ఉందో ఈ పద్యంలో వివరించబడింది.

> అవ్విధమునఁదోఁచిన మటి
> నవ్వుచుఁ దెగడుచును బెరసి నంపర పగలే
> కవ్వీరులు నెయ్యము
> నివ్వటిలఁగ విలసనములు నెఱయ వెలయఁగన్ (ఆశ్రమవాస-2-123)

వేదవ్యాసుడు భారత రణంలో మృతులైన వారిని రావించి ధృతరాష్ట్రులకు చూపుతున్నాడు. ఇది విస్మయాన్ని కలిగించేఘట్టం. అక్కడచేరినవారు గాఢా

ఆతని తమ్ములు కర్ణుడు, అభిమన్యుడు మున్నగువారిని ప్రత్యక్షంగా సజీవులుగా చూడగలుగుతున్నారు. లోకంలో అందరికీ చనిపోయిన తమవారిని మళ్ళీ ఒకసారి చూస్తే ఎలా ఉంటుందో అన్నకోరిక అంతరాంతరాల్లో ఉండితీరుతుంది - కాని అది నెరవేరేభాగ్యంలేదు. వ్యాసుడు రమ్మని అందరిని పిలవగానే మృతులైనవారు తమ దివ్యదేహాలతో దివ్యాంబర దివ్యభూషణాలతో కనిపించారట! ధృతరాష్ట్రుడు వారిని చూడడానికి వీలుగా దృష్టిపొందాడు గాంధారి కళ్ళకుకట్టుకొన్న గంతలు తటాలున తొలగించి అద్భుతప్రదభరిత మై చూసిందట! పైపద్యానికి అర్థం ఇది.

మృతులైనవారు ఆవిధంగా మళ్ళీ అగుపించి నవ్వుతూ ఉపేక్షతో ఆజ న్మాన్ని సమీక్షించి జీవించి ఉన్నప్పటి పగను మరచి స్నేహంగా విలసంగా ప్రకాశి స్తున్నారు.

మరణాంతాని వైరాణి అంటారు ఈ విషయం గమనిస్తే వైరం శాశ్వతం కాదని, ఇదికూడదని అర్థమవుతుంది.

అరిగి మంగడు సచ్చిన కులాంగనయున్ శశిగ్రుంకినట్టి శ<br>ర్వరియును బోల్పఁబట్టగుచు వారిజనాభుఁడు లేని దీనతం<br>బొరసి కృపైక భాజనతఁబొందిన యప్పురిఁజూచి మానసం<br>బెరియుఁగఁజొచ్చె నేటి కెదిరీడిన చాడ్పుననేమి చెప్పుదున్

(మౌసల-98)

యాదవశ్రేష్ఠులు మరణించారు. సర్వ ధర్మపరిజ్ఞాత, కురుపాండవ సంగ్రామనేత, లోక కళ్యాణ సంధాతమైన, కృష్ణుడు తనువు చాలింపబోతున్నాడు కాలం అన్నిటికన్నా శక్తిమంతం. కాలమూలం సర్వం. కాలమే శాసిస్తుంది కాని కాలాన్ని ఎదిరించగల సాహసం ఏ శక్తికీ లేదు. యాదవుల మరణాన్ని విని పాండవులు రోదించారు. ఆ వార్త తెలియగానే పాండవమధ్యముడు ద్వారకకు బయలుదేరాడు. సముద్రతీరాన మదిరాపానమత్తులై వట్టి తుంగతో మోదుకొని ఒకరి నొకరు చంపుకున్నారు యాదవులు. కృష్ణుని అంతటివాడు యాదవులమధ్య నలిగిన వైమనస్యాన్ని దుర్మార్గబుద్ధిని తొలగింపలేకపోయాడు యాదవులు పర స్పర హననంతో పరలోకం చేరారు.

ద్వారకను చేరబోతున్న అర్జునునికి ఆ నగరం వివర్ణమై కనిపించింది. భర్త చనిపోయిన కులసతిలాగా, చంద్రుడు అస్తమించిన రాత్రిలాగా కృష్ణుడులేని ద్వారకానగరం దైన్యంగా కనిస్తున్నది ఆ నగరాన్ని చూచి అర్జునుని మనసు భగ్గుమన్నది అపాయశంకతో దారి నడుస్తున్న అతనికి ద్వారకానగరానికి వెళ్లడం ఏటికి ఎదిరీదినట్టుగా ఉంది. ఎంత పరిష్టమైన ఉపమానం!

ద్వారక చేరిన అర్జునునికి వసుదేవుడు జరిగింది వివరించాడు. కృష్ణుడు వసుదేవుని అనుమతి తీసుకొని తపోనిష్ఠతో వనానికి తరలిపోయాడు అని తెలిసింది అర్జునుని ద్వారకకు తీసుకురావడానికి దారుకని నియోగించి ఆ విషయం వసు దేవునితో చెప్పి వెళ్ళిపోతాడు కృష్ణుడు అరణ్యంలో బోయచేతిలో అసువులు

విడిచాడు. సంకల్పసిద్ధుల కార్యసాఫల్యానికి హేతువు వట్టి మిషమౌసల పర్వంలో కాలమహిమ పలు తీరులుగా ప్రస్తావించబడింది.

ఆ పర్వం చివరలో వేదవ్యాసుడు అర్జునునికి చేసిన హితోపదేశంలో ఇదే మాట అంటాడు.

కాలమూలంబు సర్వంబుగాన దీని
కొండు దలంపులు దక్కి మీ రుత్తమంపు
గతికిజనుడు నిశ్చిత వికార ి ంపులు
విడచి.... అని బోధిస్తా వ్యాసుడు.

భారతంలో అంగిరసం తం, మనసులో శాంత తరసద్భోధ కలిగించ డానికి తత్త్వజ్ఞానం అవసరం ఎన్నో రకాలుగా వివరించబడిన ధర్మాల్లో అది సంకలితమైనా కృష్ణనిర్యాణంవల్ల సమయంలో ఆ తత్త్వజ్ఞానం సూటిగా నెలకొంటుంది.

కృష్ణ నిరహితమైన దా స్థితి దయనీయంగా ఉందనీ. ఉపమానాలే చెబుతున్నాయి. "ఏటికి ఎదురీదిన చ న్న ఉన్న ఉపమ శోకవిదురచిత్తస్థితిని విశదం చేస్తున్నది. అత్యంతాప్తులు మరణిస్తే వారిని చేరబోయే వారి మనస్థితి ఏటికి ఎదురీదినట్లుంటుందన్న ఉపమ వి అనుభవంలో నుంచి పుట్టి అనిష్టశంకను అద్భుతంగా ప్రతిఫలింపజేస్తున్నది. ఇలాంటి ఉపమలే వస్తుసాక్షాత్కారానికి, భావస్ఫురణకు జీవాతువులు,

అనవుడు ధర్మనందనుండు మ్మహాత్మునితో
　　వినుఁ భ క్తియుతుని విడుపు బ్రహ్మ
హత్యం బోలెడి పాపమని చెచెదురు పెద్ద
　　లట్లు గావున దీని నఖిలధర్మ
సారజ్ఞ విడుచుట చనుదు దివ్యసుఖంబు
　　నకుంగాంగ బాపంబునకుం జూరంగ
జాల నాపుడును. వాసవుండు వ్రతస్థుండు
　　కుక్కనంటిన వారికోరిచేయు
సుకృతమునకు నాశంబగు సువ్రతాత్మ
　　యింత యొప్పని నిర్బంధమేల చెపుమ
విడువు మీ శునకము దీని విడువబడుట
　　నాకలోక సౌఖ్యంబు నానర్చు నీకు　　(మహాప్రస్థానిక-65)

ప్రస్థానమునకై సాగిపోతూ ఒకరొకరుగా కృష్ణనిర్యాణానంతరం నిర్విణ్ణులైన పాండవులు మహాప్రస్థానానికై ఒకరినొకరుగా అసువులవిడారు ధర్మపత్ని (కు డా ప్రాణం విడచింది. అయినా ధర్మజుడు ఆగలేదు. తమ వెంట వస్తున్న సారమేయంతో సాగిపోతున్నాడు ఆ సారమేయం మెవరోకాదు ధర్మదేవత. ఇంద్రుడు రథసహితుడై వచ్చితనతో స్వర్గానికిరమ్మని ధర్మరాజును ఆహ్వానిస్తాడు తనతో వస్తున్న సారమేయాన్ని కూడా రానిస్తే రాగలననంటాడు. ఈ విషయమే పద్యంలో వర్ణితం.

"భక్తి పరుని విడిచి పెట్టరాదు. అది బ్రహ్మహత్యతో సమానమని పెద్దలంటారు ఓ ధర్మతత్వజ్ఞా, అందువల్లనే నీ సారమేయాన్ని వదిలి పెట్టలేను దివ్యసుఖం కోసం నమ్మిన వారిని మోసంచేయను అని ధర్మరాజు పలుకగా వ్రతదీక్ష పూనినవారు కుక్కనంటటం కూడదు దానివల్ల సుకృతం నశిస్తుంది. దీని విషయకంగా ఇంత నిర్బంధం వద్దు దీనిని విడిస్తే నాకలోకసుఖం లభిస్తుంది అని ఇంద్రుడు సమాధానం చెబుతాడు.

శునకం కోసం నాకసుఖం వదలుకొన్న ధర్మరాజులో ఎంతటి తాత్త్వికనిష్ట ఉందో అతని వాక్కులో వ్యక్తమవుతుంది. సర్వసమభావన నెలకొన్న హృదయాలు గాని అలా ప్రవర్తింపవు. రాగద్వేషాలకు సుఖదుఃఖాలకు లోబడని చిత్తవృత్తి ధర్మరాజుది. పల్కొక్కటి సేతయొకటి యగుట చాల దోషము అని ఆయన హృదయం, తాను విన్న హితోపదేశాలకు జీవితం చెప్పిన పాఠాలకు నొందిక కుదుర్చుకొని మహాభారతంలో పోషింపబడిన శాంతరసానికి నాయకుడైనాడు. తమభావన ధర్మజునిలోని సర్వసమతత్వ స్థితిరూపంలో పరిపాకమైంది మానవాళికది ఆదర్శమైంది.

ధర్మరాజు చరిత్రలోని కొన్ని పరివాదాస్పదాలైన అశాంతి ఆధారంగా న్యాయాన్యాయ విచారణ చేయడం జీవితానుభవం పుష్కలంగాలేని వారు చేసే పని. సముద్రం ఉపరితలంలో ఊర్మికల కల్లోలమున్నా గర్భంలోని గాంభీర్యంలో స్వాస్థస్థ్యం ఉంటుంది. ఉత్తములకు ప్రవర్తనలో ఉద్వేగాలున్నా హృదయంలో ప్రశాంతి ఉంటుంది. అస్థితిని సాధించినవారు ఎందరో ఉన్నారు. అలాంటివారు లేరనడం మానవజాతిని అవమానించడం మనం కౌరవులం కాకపోయినా మన మధ్య ధర్మరాజులు నేడూ ఉన్నారు. రేపూ ఉంటారు.

పద్యం సరళంగా ఉన్నా ప్రసక్తమైన విషయం పరమోదాత్తంగా ఉంది
పావన! దుర్దశాపహ! శుభప్రదమూర్తి సుధానుభూతి సం
జీవిత భక్తలోక! తులసీదళదామ కపాలమాలి కా
భావితవాభిరామ! పరిపక్వ తపఃఫలరూప! సాంఖ్యవి
ద్యావహ! యోగశక్తి విశదాద్భుతఖేలన లోకపాలనా

(స్వర్గారోహణ-95)

భారతరచనను ఆనాటితో ముగిస్తూ ఆ కార్యసాధనలో తనకు యత్నానికి ప్రేరణ ఇచ్చిన హరిహరనాథుని తిక్కనగారు మధురమధురంగా స్మరించుకొన్నారు. ఆ మహాకవి జ్ఞాన భక్తిసిద్ధాంతాలను తనలో జీర్ణంచేసుకొని జీవితాన్ని తేజస్వంతం చేసుకొన్న మహానుభావుడు కొందరు కవులు ఇహలోకాన్ని లక్షించి పరలోకాన్ని పోగొట్టుకుంటారు. మరికొందరు పరలోకాన్ని నమ్మి ఇహలోక జీవన మాధుర్యానికి వెలియైపోతారు తిక్కన ఈ రెంటిని మేళవించి రసలోకాన్ని సృష్టిం

చుకొన్నాడు అందుకనే ఆయనమాట అనుభవస్పర్శతో అలరారుతుంది. తిక్కన కవి హరిహరనాథునికి ప్రయోగించిన ఒక్కొక్క విశేషణం ఆయన అనుభవమందిరాన్ని చూడటానికిఒక్కొక్క గవాక్షం. పై పద్యానికి అర్థమిది.

పవిత్రుడా! భక్తుల కష్టములను తొలగించు వాడా మంగళములను కలిగించువాడా అమృతానుభూతిచే భక్తసముదాయాన్ని జీవింపజేసేవాడా తులసీ దళాల కపాలమాలికల కాంతులచే కృష్ణ శ్వేతవర్ణాలలో అలరారువాడా! పరిపాకమైన తపస్సుకు ఫలరూపమైనవాడా సాంఖ్యతత్వాన్ని అనుగ్రహించేన వాడా యోగశక్తి చేత స్పష్టమైన విహారము గలవాడా లోకములను పాలించువాడా హరిహరనాథా- ఇదిభక్తి భరితాంతః కరణంతో చేసిన దైవస్తుతి.

హరిహరనాథుడు తిక్కన సజ్జ సృష్టికావచ్చును. తిక్కన కవిలో ఒక విశిష్టగుణముంది. ఎదుటనున్న వస్తువిషయాలకు వైరుధ్యం పరిహరించి ఐక్యత ఘటించడం. మేధావిలక్షణమే అది. అలాగా సాహిత్యములోని సర్వలక్షణాలకు సమైక్యత సాధించుకొన్నాడు. మంత్రిపదవిని నెరవిన అతనికి జీవితంలోని సమస్యలేవోతెలుసును. తనకు ఆశ్రయమిచ్చిన రాజు అభ్యుదయాన్ని చూశాడు, పతనాన్ని చూశాడు, తానురాయబారిగా వెళ్ళి రాజ్యం సంపాదించిపెట్టాడు అధికారాన్ని వదలి రసరాజ్యాన్ని వరించాడు, తరించాడు మనను తరింపజేస్తున్నాడు హరిహరనాథుణ్ణి ఆయన వేడుకొన్నది జననమరణాదులైన సంసారదురితములకు నగపడకుండంగ దొలగుతెరువు గనువెలుంగు ఆవెలుగు ఆయనకు లభించిందనడానికి భారతరచనలో ఆయన అభిప్రాయములే కాదనరాని సాక్ష్యం శైవమని వైష్ణవమని భిన్నదృక్పధాలతో అంతరార్థం హరిహరనాథుని వర్ణనలో స్పష్టంగా ప్రకటించారు ఆ రసైకజీవి.

తెలుగు సాహిత్య కాశంలో తిక్కన వేవెలుగు. ఆవెలుగు దర్శించడానికి ఎవరిశక్తికొలది వారు ప్రయత్నించేస్తారు ఆవెలుగు తరిగేదికాదు తరింపజేసేది. ఆవెలుతురు ప్రసరిసునంతకాలం తెలుగు ప్రపంచం తేజస్వంతం అవుతుంది. ఆయన వచస్సు తెలుగు తేజస్సు.

---

• చుట్టూరా ఆవరించుకుని వున్న
చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం
కంటె, ప్రయత్నించి ఎంత చిన్న
దీపాన్నయినా వెలిగించడం మంచిది •



తెలుగు ఎదలో తెలుగుతనం
వెల్లువలా పారాలని
తెలుగింటిలో తెలుగుదీపం
అఖండంగా వెలగాలని
ఈ జాతి నిద్రలేచి
మహోన్నత మానవాదర్శాలు వైపు
నిరంతర కృషితో
పయనం కొనసాగించాలనే ధ్యేయంతో
ఉడుతాభక్తిగా యువభారతి కృషి చేస్తున్నది
భాషాభిమానం కలగాలంటే
మాతృభాషా సాహిత్య పఠనమే
ప్రథమ కర్తవ్యం అనే భావం
బలంగా మనసులో నాటుకోవడానికి గాను
వీలైనంత ఎక్కువ మందికి వీలైనంత తక్కువ వెలకు
ఉత్తమసాహిత్యం అందించేందుకు
యువభారతి పూనుకున్నది
ప్రతి తెలుగింటిలో
కనీసం పదయినా తెలుగు పుస్తకాలు ఉండేందుకు
మనందరం ఉద్యమ వేగంతో కృషిచేద్దాం
ఆ పది మంచి పుస్తకాలలో ఏ ఒక్కటిగానైనా
యువభారతి ప్రచురణ ఏ ఒక్కటైనా
ఉండాలనే ధ్యేయంతో కృషిచేద్దాం

# యువభారతి

సాహితీ, సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3